నెహ్రూ బాల పుస్తకాలయం

# బడాపానీ

లీలా మజుందార్

అనువాదం

వి. పతంజలి

చిత్రాలు

పులక్ బిస్వాస్





ప్రదమ ముద్రణ 1973 (శక 1894)
ద్వితీయ ముద్రణ 1991 (శక 1912)


BARAPANI (Telugu)

రూ. 5.50

డైరక్టరు, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా
ఎ-5, గ్రీన్‌పార్కు, కొత్త ఢిల్లీ - 110 016 చే
ప్రచురింపబడినది.



# బడా పానీ

కొండ దిగువన లోయలో ఎర్రటి పై కప్పుతో స్కూలు – పక్కనే గల గల లాడుతూ ప్రవహించే సెలయేరు – సెలయేటికి అడ్డంగా కర్ర వంతెన. స్కూలు విడిచిపెట్టగానే కానూ కొండమీద వున్న తన ఇంటివేపు పరుగుతీశాడు. కర్ర వంతెన దగ్గరికి చేరేసరికి, సెలవు రోజుల్లో నానాతో కలిసి సెలయేటిలో చేపలు పట్టడం గుర్తుకి వస్తూంటుంది అతనికి. వంతెన కిందవున్న బండరాయిమీద కాళ్లకి మాత్రమే ఎండ తగిలేలా కూర్చుంటారు. రాత్రి వేడి నానా వొంటికి వెచ్చదనం ఇస్తుందిట.

కొండమీద కంటా వున్న మెట్లమీదనుంచి ఎక్కి వెడితే, ఇంటికి చేరడానికి కానూకి సరిగా పది నిమిషాలు పట్టేది. పది మెట్లు ఎక్కడం, పక్కకి తిరిగి నాలు గయిదు అడుగులు వేయడం, మళ్ళీ ఇటు తిరిగి మరో పది మెట్లు ఎక్కడం.



కొండని ఆనుకొని వున్న ముల్కీగూడెం చేరడం. తన గది కిటికీలోనుంచి చూస్తే ధాన్‌ఖేతీ లోయ అవతలతట్టున వున్న పాత సర్వే ఆఫీసు కిటికీలు కనబడతాయి. బస్తీలో వున్న ఆఫీసుకి బదిలీ అయేవరకూ బాపూ అక్కడే పనిచేసేవాడు.

కొండ ఎక్కుతూ దారిలో ఎన్నో ఇళ్లు దాటుతాడు. ఇంటికి చేరేసరికి, ఎవరింట్లో ఏం వండుకుంటున్నారో కానూకి తెలిసిపోయేది.

ఒకొక్కప్పుడు ఆ ఇళ్ల వాళ్లే అతన్ని పిలిచి అపు చేసేవారు. "అమ్మ కులాసాగా వుందా?" అని అడిగేవారు. "నాన్న దగ్గర నుంచి ఉత్తరాలు వస్తున్నాయా?" అని తెలుసుకునేవారు. వాళ్లు చేతిలో పెట్టిన పప్పుబెల్లాలు తింటూ కొండ ఎక్కుతాడు. కానూ ఇలాగ అందరి ఇళ్లలోనూ అవీ ఇవీ తినడం తల్లికి ఇష్టం వుండేది కాదు. కానూ మేనమామల ఇల్లు మైదాన ప్రాంతంలోని అజయానది ఒడ్డున వుంది. అక్కడి పరిస్థితి అంతా వేరుగా వుంటుంది.

అక్కడ నేల ఎగుడు దిగుడుగా వుండదు. అంతటా ఒకేలా చపాతీలా వుంటుంది. మట్టి ఎర్రగా వుంటుంది. నేల పగుళ్లు తీసి వుంటుంది. నిటారుగా పెరిగిన చెట్ల మధ్య నుంచి వేడిగాలి ఈ చెవి నుంచి ఆ చెవికి కొడుతూవుంటుంది. మార్చి నెలలో అయితే, కన్ను చెదిరేలాంటి ఎర్రటి పువ్వులుంటాయి. కనుచూపు మేరదాకా అంతటా విరిసిన రక్తగన్నేరు పువ్వులు ఎంత దూరానికయినా కొట్టవచ్చినట్టు కనబడుతూంటాయి. కానూ ఆ మైదాన ప్రాంతాలు ఎన్నడూ చూసి ఎరగడు.

"అమ్మా! నానా! ఎక్కడున్నారు మీరంతా! నాకు ఆకలివేస్తోంది" అని అరిచాడు కానూ. దొడ్లో అడుగు పెట్టి, వెనక వరండా మెట్లు ఎక్కుతున్నాడు. అందరూ ఒక్కపాటున ఇవతలికి వచ్చారు - భోజనాలగది తలుపు తీసుకుంటూ అమ్మ, వరండా చివరవున్న తన చిన్న గదిలోంచి నానా, మ్యావ్-మ్యావ్ అంటూ పక్కనుంచి నిద్రజోగుతూ పిల్లీ, క్షణం కాలు కుదురులేని అడవిబొచ్చు కుక్కాను.

"కోడిపెట్టలు ఎన్ని గుడ్లు పెట్టా యేమిటి ఇవాళ?" అని అడిగాడు నానా వెంటనే.

ఈ ప్రశ్న అమ్మకి నచ్చలేదు. "పొద్దున్ననగా పోయి ఇప్పటి కొచ్చాడు కుర్రకుంక. వాడికింకా తినడానికి ఏమీ పెట్టనయినా లేదు. గుడ్లుట గుడ్లు! నువ్వెళ్లు అవతలికి!" అనేసింది. నానా కళ్లలో వున్న చిరునవ్వు క్షణంలో మాయమయింది. పుస్తకాల సంచి అలా గిరాటేసి, ఒక్క అదటున నానాని చుట్టువేశాడు కానూ. నానా పాపం ఊగిపోయాడు.

"ఏం? పధ్నాలుగు గుడ్లు దొరికాయి, నానా! ఒకటి మాత్రం పగిలి పోయింది" అని అరిచాడు కానూ.



"పోతుల్లాంటి ఇరవై పెట్టెలనుంచి పధ్నాలుగు గుడ్లా? ఎవరేనా నవ్వి పోతారు!... లే ఇంక, జోళ్లు విప్పుకుని కాళ్లూ చేతులూ కడుక్కో, అన్నం తిందువుగాని. పూరీలు చేశాను. దొడ్లో పండిన బంగాళాదుంపలు, బఠాణీలతో కూర చేశాను. లోయలోంచి నానా మాంచి రేగిపళ్లు కోసుకొచ్చాడు."

కానూకి తన ఇల్లంటే ఎంతో ఇష్టం. తెల్లగా వెల్లవేసిన గోడలు, ఎర్రటి పై కప్పు, ఆకుపచ్చని రంగు పూసిన తలుపులు, కిటికీలు అతనికెంతో నచ్చుతాయి. మిట్ట మధ్యాహ్నం కొండ దిగువ సెలయేరు పక్కగా వున్న స్కూలు దగ్గరనుంచి చూస్తే, తన రంగు రంగుల ఇల్లు ఎండలో ఎంత మెరిసిపోతూవుంటుందో! "వచ్చెయ్యరాదూ?" అని పిలుస్తూన్నట్టు అనిపిస్తుంది కానూకి. "నీ కోసమే కాచుకు కూచున్నా.. తొందరగా వచ్చెయ్" అంటూన్నట్టు వుంటుంది.

ఇంటి వెనక చిన్న తోటలో మాలి రకరకాల కూరగాయలు పండిస్తాడు-చిలకడదుంపలు, ముల్లంగి, కాబేజి ఇంకా ఎన్నో. తోటనిండా పళ్ల చెట్లే-ఇక్కడ ఒకరకం రేగి, అక్కడ మరో రకం రేగి. మధ్య మధ్య రంగు రంగుల ఆపిల్ పళ్ల చెట్లు. కొన్ని రకాల ఆపిల్ పుల్లగా వుంటాయి గాని, నానా పంటలో తంపడవేసి పెడితే భలే మజాగా వుంటాయి. కానూకి నానా అంటే చాలా ఇష్టం. నానాకి ఇప్పుడు డెబ్బయి ఎనిమిదేళ్ళు - మాగిపోయిన ఎర్ర ఆపిల్ పండులా వుంటాడు.

అమ్మ చెబుతూ వుండేది-నానా మనకి అంత కావాల్సిన చుట్టమేమీ కాదట. తాతయ్యకి స్నేహితుడు, అంతే. ఇద్దరూ ఫారెస్టు డిపార్టుమెంటులో పనిచేసేవాళ్లు. ఇప్పుడు తాతయ్య లేడు. బాపూ ఏమో బస్తీలో వుంటున్నాడు. బాపూకి కూడా నానా అంటే ఎంతో అభిమానం. పధ్నాలుగో ఏట స్కూలుకి స్వస్తి చెప్పి ఫారెస్టు డిపార్టుమెంటులో మొదట వార్తాహరుడిగా, తర్వాత - తాతయ్యలాగా - ఫారెస్టు గార్డుగా పనిచేశాడట. అయినా, జీవితంలో నేర్చుకోదగ్గ ఎన్నెన్నో విషయాలు నానాయే చెప్పేవాడట బాపూకి.





## 2

"ఇవాళ ఏం చేద్దాం నానా? నువ్వు చేసి ఇచ్చిన పంగలకర్ర వాడదా మేవిటి? మాలి పెంచిన చిన్న పావురాన్ని ఎగరేసుకు పోయిందే, ఆ గద్దని కొట్టేద్దాం!" అన్నాడు కానూ.

తల్లికి భయమేసింది. "వద్దు వద్దు, గద్దలు మహా చెడ్డవి. మీదపడి పొడుస్తాయి. పోనీ, ఆ వేపచెట్టుమీదున్న కాకుల్ని కొట్టరాదూ, ప్రాణం తీస్తున్నాయీ!"

నానా మాట్లాడలేదు. తర్వాత కానూతో అన్నాడు గదా: "ఈ కాకులు సామాన్యమైనవి గావు – బొంతకాకులు నాయనా! వీటిని పెంచి మాటలు నేర్ప వచ్చు. గొరగొరలాడే గొంతుకలతో ముసిలి వాళ్లలా మాట్లాడతాయి. ఒకప్పుడు నా దగ్గరా వుండేది ఓ బొంతకాకి. . . . ."

"చెప్పు నానా చెప్పు. . నీ బొంతకాకి ఏమైందిప్పుడు? చెప్పు. . ఏమైంది దానికి? తాతయ్య చూశాడా దాన్ని ఎప్పుడేనా?" అని ఆసక్తితో అడిగాడు కానూ.

"ఆఁ! చూశాడు. మల్కీ అవతలవున్న రిజర్వు ఫారెస్టులో మేమిద్దరమూ ఫారెస్టు గార్డులుగా పనిచేసేవాళ్లం. ఒకసారి పెద్ద గాలివాన వచ్చింది. ఓ చెట్టు చిటారి కొమ్మనున్న గూడులోంచి ఓ బొంతకాకి పిల్ల గాలి విసురుకి కింద పడిపోయింది. పుల్లలు ఏరుకునే పిల్లలెవరో చూశారు దాన్ని. ఆ కాకిపిల్లకి

ఈకెలు లేవు. వళ్లంతా నల్లగా, నునుపుగావుంది. గులాబిరంగు చర్మం మిల మిలా మెరిసిపోతోంది. జేబులో వేసుకొని తిరిగారు పిల్లలు కొంతసేపు. తల్లి తిట్టిందో ఏమో, దాన్ని ఆ చెట్టు మొదట్లో పెట్టేసి వెళ్లిపోయారు. తల్లికాకి తీసుకుపోతుందిలే అనుకుని వుంటారు. కాని, పిల్లకాకుల వొంటిమీద మనుషుల స్పర్శవాసన తగిలితే మరి తల్లికాకులు వాటిని ముట్టుకోవు. ముక్కుతో గుచ్చి, హింసించి గూడులోనుంచి కిందికి తోసేస్తాయి.''

కానూ ఊపిరి బిగబట్టి వింటున్నాడు. అతనికి జాలి వేసింది. ''నువ్వే ఏం చేశావు అప్పుడు?'' అని అడిగాడు నానాని.

''మీ తాతయ్య పిల్లకాకిని జేబులో వేసుకుని, ఆ చెట్టు ఎక్కాడు. పెద్ద కాకులు అరుస్తూ కేకలుపెడుతూ, ఆయన ముఖం మీది కంటా ఎగిరివచ్చాయి. తువ్వాలుతో వాటిని అదిలించి, ఎలాగయితేనేం పిల్లకాకిని గూడు చేర్చాడు. కాని, తల్లికాకి వెంటనే దాన్ని కిందికి తోసేసింది. నేను పట్టుకుని వుండకపోతే, అది కిందపడి చచ్చేదే. ఆ పిల్ల గుండె నా బొటనవేలికి తగిలి ఎంత గిలగిల్లాడిందో దాన్ని నా దగ్గరే వుంచుకుందామని నిర్ణయించుకున్నాను.

''ఇంటికి తీసికెళ్లి, భార్య కిచ్చి పెంచమన్నాను. దానికి పిల్లలు లేరు. దీన్ని పెంచుతూవుంటే ఊబుసుపోతుందిలే అని చెప్పాను. అలా వుండగా పిల్ల పెరిగి పెద్దదయింది. బొద్దుగా వొంటినిండా నల్లటి రెక్కలూ, మెరిసిపోయే ఎర్రటి కళ్లూ, బాగా ఎదిగింది.''

''భార్య ఎవరు నానా? ఇప్పుడు ఎక్కడున్నారు?''

''నా ఇల్లాలు నాయనా! ఇప్పుడు అదుగో ఆ పైన కొండమీద రాజు గారున్నారే, వాళ్లింట్లో వుంటోంది. అక్కడ అంతా సుఖంగా ఉంటారట. ఆవిడ వెళ్లిపోయినప్పటినుంచీ నేను ఈ ఇంట్లోనే వుంటున్నాను.''

''ఆవిడ నిన్ను విడిచిపెట్టి వెళ్ళిపోవడం తప్పు కాదూ?''

''కాదు నాయనా, ఆవిడ చాలా మంచిది. బొంతకాకిని జాగ్రత్తగా పెంచుతూ వుండమని చెప్పి వెళ్ళింది.''



"ఇరవైరెండేళ్లు పెంచాను దాన్ని. ఇలా వుండగా, ఓనాడు పొద్దున్నే అది ఎగిరి వెళ్లింది. మరి వెనక్కి రాలేదు. ఆవిడని మళ్ళీ కలుసుకున్నప్పుడు ఈ సంగతి ఎలా చెప్పాలో తెలియడం లేదు."

కానూకి ఆశ్చర్యం వేసింది. "ఆవిడని ఎలా కలుసుకోగలవు నానా? పై కొండమీదికి దారి తెలుసా నీకు?"

నానాకి ఈ ప్రశ్న ఇష్టం లేదు. "ఎందుకు తెలీదూ? అదే తెలుస్తుంది. ఈ సెలయేళ్లూ నదులూ బడాపానీకి వెళ్లడం లేదూ, అలాగే. బడాపానీ చూడలేదూ నువ్వు? ఆ పెద్ద రోడ్డు పక్కగా ఈ చివరినుంచి ఆ చివరిదాకా వుంటుంది.... సరిలే.... ఇవాళటికిది చాలు.... మనం సెలయేటి దగ్గర చేపలు పట్టుకుందాం పద.... రేపు సెలవు. నీకు చదువుకోవాల్సింది వుండదు కూడా."

సామగ్రి తీసుకుని వంతెన దగ్గరకి వెళ్లారు. నానాకి కీళ్లబాధ వుంది కనక మెట్లమీద నుంచి కిందికి దిగలేదు. కనక చుట్టు తిరిగి బాటవెంబడే వెళ్ళారు ఇద్దరూ. వయసులో వున్నప్పుడయితే

నానా రెండేసి మెట్లు ఒకేసారి ఎక్కేవాడు. నెత్తిమీద బరువు పెట్టుకున్నా అలానే ఎక్కేవాడు.

చేపలు పట్టేందుకు వంతెనకింద పిల్లకాక ప్రత్యేకమైన స్థలం వుంది. విశాలంగా పరుచుకున్న చెట్లనీడ చక్కగా వుంటుంది. ఎండకి వెచ్చబడే బండ రాయి ఒకటుంది అక్కడ. నానా తెచ్చే చీమ గుడ్ల కోసం చేపలు బిలబిల లాడుతూ వచ్చి చేరతాయి. నానా చేపలు పట్టడంలో దిట్ట. అతనికి తెలియని దంటూ లేదు. ఈ బండరాయిమీద కూర్చునే తాతయ్యతో చేపలు పట్టేవాడు. ఆ తర్వాత బాపూ కూడా ఇక్కడికి వచ్చేవాడు. "అతి చిన్న చేపలు పట్టవద్దు" అన్నాడు నానా. "పాపం పిల్లలవి. చూడు ఎంత చలాకీగా తిరుగుతున్నాయో. వాటి జోలికి వెళ్ళకు. పెద్ద చేపలే మంచిది మనకి. కూరకి చక్కగా వుంటాయి. చిన్నవాటిని నీట్లో వదిలెయ్" అన్నాడు. ఒక చిన్న చేప గొంతులోంచి జాగ్రత్తగా కొక్కేన్ని తప్పించి, నీటిలో విడిచిపెట్టాడు.

"నానా! పిల్ల జంతువులంటే ఇష్టమా నీకు? చేప పిల్లలు, గువ్వ పిల్లలు, క్రిములూ, పురుగులూ కూడా? అయితే పాము పిల్లలన్నా ఇష్టమేనా నీకు?"

నానాకి నవ్వొచ్చింది. "పురుగుల్నీ, పాముల్నీ దూరాన్నుంచి చూడడం మంచిది. ఈ చెట్లమీద రొప్పుతూ రోజుతూ వున్నట్టు పాకే గొంగళీ పురుగుల్ని చూశావా? ఎప్పుడూ ముట్టుకోకు సుమా! వాటి వెంట్రుకలు గుచ్చుకుని మహా బాధపెడతాయి. ఎప్పుడేనా గుచ్చుకుంటే, కొంచెం సున్నంరాసి ఆరిపోనిస్తే, వెంట్రుకలు రాలిపోతాయి."

"మరి పాముల మాట?" కానూ అడిగాడు.

"సుఖంగా వుండే కన్నాలు వెతుక్కుని శీతాకాలమంతా ఆ పుట్టల్లోనే గడుపుతాయి పాములు. వాటి దారికి అడ్డురాకపోతే పాములు మన్నేమీ చేయవు. ఒకసారి ఏం జరిగిందంటే, మా అన్నయ్య ఓ పెద్ద బండరాయిని వత్తిగించాడు. దాని కింద ఓ లోతైన కన్నం కనబడింది. దాంట్లో ఆకుపచ్చని పాము కదలకుండా పడివుంది. దాని నీలం కళ్ళలో ఏమీ చలనం లేదు. అన్నయ్య బండరాయిని మళ్ళీ అలానే వుంచేసి వచ్చాడు. 'శీతాకాలం అయిపోయాక లేస్తుంది' అన్నాడు. 'మరి దాని కళ్లు తెరుచుకునే వున్నాయే?' అవి



అడిగాను నేను.'' "పాములకి కంటి రెప్పలుండవు. అందుకని కళ్లు మూసు కోలేవు. లేచిన తర్వాత, పాత కుబుసాన్ని విడిచిపెట్టి మెరిసే కొత్త కుబుసాన్ని పెంచుకుంటుంది. మొదట్లో, కొత్త కుబుసం అతి మెత్తగా వుంటుంది. కనక కదలికలో బాధపడలేదు. పాముని చంపడం అలాంటప్పుడు అతి సులువు'' అన్నాడు. "విషపు పాముని ఎందుకు చంపేసేవు కాదూ?'' అని అడిగాను. "శత్రువునైనా అది బలహీన దశలో వున్నప్పుడు హాని చెయ్యకూడదు'' అన్నాడు అన్నయ్య.

# 3

ఎప్పుడో, ఎన్నో ఏళ్ల క్రితం జరిగిన సంగతులను గురించి ఆ రోజంతా నానా చెబుతూనే వున్నాడు. ఈ మధ్య జరిగిన సంగతులు అతనికి గుర్తుండేవి కాదు. మనుషుల పేర్లూ, విశేషాలూ కలగా పులగం చేసేవాడు. పాతకాలపు విశేషాలు మాత్రం అతనికి బాగా జ్ఞాపకం వున్నాయి.

సూర్యుడు అస్తమించబోతూవుంటే సామగ్రి తీసుకుని లేచారు. నానా అయిదు చేపలు పట్టాడు. అతని సాయంతో కానూ ఆ అయిదింటికన్నా పెద్ద చేప ఒకటి పట్టాడు. గాలి చల్లబడింది. కొద్దిగా చలి వేస్తోంది కూడా. కొండ గుటల్లు



మాత్రం ఇంకా వేడిగా, వెచ్చగా వున్నాయి. ఆకాశంలో ఉత్తరం వైపుకి చేయి చూపించాడు నానా. ఆకాశంలో గీచిన చక్కని చిత్రంలా వుంది అది. దూరాన మంచు కప్పిన కొండలు. వాతావరణం బాగావున్న రోజుల్లోనే ఆ కొండలు స్పష్టంగా కనబడతాయి.

కానూ ఉత్సాహంతో ఉక్కిరి బిక్కిరయ్యాడు. "ఎప్పుడేనా ఒకసారి అక్కడికి వెళదామా నానా? తాతయ్య ఎప్పుడూ వెళ్లలేదా అక్కడికి?" నానా అడ్డంగా తల ఊపాడు. ఆ మంచు కొండలు ఎన్ని వందల మైళ్ల దూరాన వున్నాయో! మధ్యలో మరికొన్ని పర్వతాలు ఉన్నాయి. దగ్గరగా వుండేవి ఆకుపచ్చగా వుంటాయి; దూరపు కొండలు నీలం, నునుపు. ముల్కీ దగ్గరలోనే వుంటుంది. అక్కడ ఇళ్ళూ, తోటలూ చాలా ముచ్చటగా వుంటాయి. రకరకాల పళ్ళు పండుతాయి. ఎన్ని రంగుల్లో వుంటాయో ఆ పళ్లు! ఆ పళ్ల సువాసన అంటే అమ్మకెంతో ఇష్టం.

చుట్టు తిరిగే దారిన వస్తే ఇంటికి దూరమవుతుంది. పాపం నానాకి దారిలో ఊపిరి ఆడలేదు. రెండుసార్లు కొద్దిసేపు ఆగాల్సి వచ్చింది. "కొండ ఎక్కేటప్పుడు ఎప్పుడూ నోరు మూసుకుని వుండాలి తెలుసా? ముక్కుతోనే గాలి పీల్చుకోవాలి లేకపోతే ఆయాసం వస్తుంది" అన్నాడు నానా. "నువ్వు ఆయాసపడుతున్నావు?" అన్నాడు కానూ. నానా నవ్వాడు. నా కిప్పుడు ఎనభై ఏళ్ళు. నేను ఆయాసపడడంలో ఆశ్చర్యం లేదు. అదిగో ఆ పడవ ఎప్పుడు వస్తుందా అని ఎదురుచూస్తున్నాను."

కానూకి బోధపడలేదు. "కొండ వాగుల్లోంచి పడవ మీదికి ఎలా రాగలుగుతుంది నానా? ఈ కొండ వాగులు ఎక్కడ దిగి బడాపానీలో కలుస్తాయో అక్కడి వరకే పడవలు రాగలవని మాస్టారు చెప్పారే?"

నానా ఒక్క క్షణం ఆలోచించాడు. "అలాగా! అయితే నేను బడాపానీ దగ్గరకే వెళ్లాల్సి వుంటుంది."

"నేను కూడా వస్తాను నీతో!"

"నీకింకా ఏడేళ్లే నాయనా! ఆ పడవలోకి నిన్ను ఎక్కనియ్యరు!"

ఈ ఎనభై ఏళ్ల జీవితంలో నేను చూసిందీ, చేసిందీ, నేర్చుకున్నదీ, అనుభవించిందీ ఎంతో వుంది. ఇన్నేళ్ళూ సుఖంగా గడిపాను. అడవుల్లో రేగే మంటలు ఆర్పాను, ముదిరిపోయిన చెట్లను నరికాను, కొత్త మొక్కలు నాటాను. నరికి వేసే ప్రతి చెట్టుకీ ఓ మొక్క తప్పకుండా నాటాలి."

"ఎందుకు నానా?"

"లేకపోతే కొండలు బోసిగా వుంటాయి. అదీకాక చెట్లవేళ్ళు లేకపోతే కొండ పెళ్ళలు విరిగి పడతాయి. వేళ్ళు మట్టిని అదిమి ఉంచుతాయి. చెట్లు లేకపోతే వర్షాలు తగ్గిపోతాయి. వానలు తగినంతగా పడకపోతే ఈ ప్రాంతం పూర్తిగా పాడవుతుంది."

"ఇంకా ఏమేమి చేశావు నానా?"

"కొన్ని జంతువుల్ని పెంచాను. క్రూర మృగాల్ని చంపాను."

"అలాగా, అయితే నువ్వు ఎలుగుగొడ్లన్నీ, పులుల్నీ చంపే వుంటావు, బోనులు పెట్టి పట్టావా వాటినీ?"

నానాకి చిరుకోపం వచ్చింది. "నిజమైన మనిషి అమాయకమైన జంతువుల్ని బోనులో ఎందుకు పెట్టాలి? క్రూరమృగం స్వేచ్ఛగా తిరిగేటప్పుడే వేటగాడు దాన్ని కొట్టాలి. అదీ గొప్ప!"

"మరి ఈ అడవిలో ఉద్యోగస్థులు అక్కడ లైకార్ రోడ్డుమీద బోనులెందుకు పెట్టారు?"

"ఓ! అవి బోనులు కావు. ముల్కి నుంచి గొర్రెల్నీ, కోడిపెట్టల్నీ ఎత్తుకుపోయే దొంగల్ని పట్టుకోడానికి! అది వేట కాదే!"

కానూ అన్నాడు: "లోపల ఓ చిన్నగొర్రెను కడతారెందుకూ? పాపం అది చీకట్లో భయపడిపోయి తెగ అరుస్తూ వుంటుంది. నేను విన్నాను. ఆ అరుపులకి పెద్ద పులి వచ్చి దాన్ని మింగేస్తుంది!" కానూ కళ్లలో నీళ్లు తిరిగాయి ఈ మాటలు చెబుతూంటే.

నానాకి ఇది ఇష్టం లేకపోయింది. "ఓయి వెర్రివాడా! అవి చారల పులులు కావు, చుక్కల చిరుతపులులు. పెద్దపులులు ఎప్పుడో కాని కొండమీదికి రావు. పైగా అవి గొర్రెపిల్లల్ని తినవు! "గొర్రెపిల్ల పులికి దొరకదు. ఎందుకంటే దాన్ని వేరే బోనులో కట్టేస్తారు. చిరుతపులి బోనులో ప్రవేశించి, గొర్రెపిల్లని అంకించుకోవాలని మీట లాగుతుంది. అంతే, మూత మూసుకుపోయి చిరుతపులి బందీ అవుతుంది. అప్పుడది ఎంత గాండ్రిస్తుందో విన్నావా? అప్పుడు ముల్కీ వాళ్లు వచ్చి దాన్ని పట్టుకుంటారు. గొర్రెపిల్లని వెంటనే విడిచిపెట్టేస్తారు. అది తల్లి దగ్గరికి 'తుర్రు' మంటుంది భయపడుతుంది గాని గొర్రెపిల్లకి ఏ హానీ జరగదు. మనిషి ధైర్యవంతుడు. కావాలంటే, అసలు భయమంటే ఏమిటో పూర్తిగా బోధపడాలి తెలుసా?"

ముల్కీగూడెంలో రోజులు ఇలానే గడిచిపోతాయి. వేసవిలో కూడా రాత్రీ పగలూ ఏకధారగా వర్షం కురుస్తుంది. ఒకప్పుడు కుండపోతగా కురిస్తే, మరొకప్పుడు చిటపట చినుకులు పడతాయి. దూరాన వున్న కొండలు మబ్బులతో మూసుకుపోతాయి. దగ్గరగా వున్న కొండలమీది నుంచి వందలాది సెలయేళ్లు కిందికి ప్రవహించి, ఇతర ప్రవాహాలతో కలిసి, పెద్ద ప్రవాహంగా కొండ దిగువన వున్న బడాపానీ వైపుగా సాగిపోతాయి. ఒకొక్కప్పుడు కానూ అర్ధరాత్రి నిద్రనుంచి లేచిపోయేవాడు. చూరునుంచి వాన చినుకులు నేలమీద టప టప లాడుతూ పడేవి. అమ్మకూడా నిద్రలేచి, చుక్కలు పడేచోట బాల్చీ పెట్టేది.



మగతనిద్రలో, టపటపా బాల్చీలోపడే చినుకుల చప్పుడు వినేవాడు కానూ. బాల్చీ నిండేకొద్దీ టప టప చప్పుడు సన్నగిలేది. కానూకి నిద్రపట్టేసేది మళ్లీ.

పొద్దున్న కానూ నిద్ర లేచేసరికి ఇంకా వర్షం పడుతూనే వుంది. అజయా నది ఒడ్డున పూరి పాకలో వున్న తన ముసలి తల్లి ఈ వానల్లో ఏం అవస్థ పడు తుందో అని అమ్మ మహా బాధపడింది. మరో జత చెప్పులూ, పుస్తకాలూ సంచిలో వేసి కట్టకట్టి మాలిని తోడిచ్చి స్కూలికి పంపింది కానూని తల్లి. మాలి కాలు జారకుండా జాగ్రత్తగా తీసికెళ్ళేవాడు కానూని. బాట ఎంతో బాడిగా బందగా వుండేవి మరి.

"వర్షాలు ఇలా తెగకురుస్తూంటే అజయా నదికి వరదలొస్తాయి" అంది తల్లి.

"అమ్మమ్మ ఇల్లు వరదలో కొట్టుకుపోతుందా అమ్మా?" అని అడిగాడు కానూ.

"అబ్బే, మన ఇల్లు చాలా ఎత్తుగా వుందిలే"

"ధాన్‌ఖేతికి కూడా వరదలొస్తాయి. మెట్లు మునిగిపోతాయి. ఆ గట్టు నుంచి ఈ గట్టుకి దాటడానికి వీలుండదు. కాని అంతా ఓ గంటలో నీరు తీసే స్తుంది అని చెప్పాడే నానా! నీరంతా బడాపానీలోకి ప్రవహిస్తుందిట. అమ్మా! నానా పడవ వచ్చేది అక్కడికే కాదూ?"

అమ్మకి నమ్మకం లేదు. "ఊరు చుట్టూ రోజుల తరబడి నీరు నిలిచిపోతుంది రాకపోకలన్నీ పడవల్లోనే. వరి మొక్కలు ఏడు రోజుల బాటు నీటిలో మునిగి వున్నాయంటే కుళ్ళిపోతాయి. అజయానది ముందు ఈ ధాన్‌ఖేతి ఓ పిల్ల కాల వలా వుంటుంది తెలుసా?" అంది.

కానూకి అర్థమయింది – అమ్మ అజయానదిని గురించి, తన ఊరు సోనాలీని గురించి బాధపడుతోందని, అందుకే మాట్లాడకుండా ఊరుకున్నాడు. ధాన్‌ఖేతి పంట భూముల్ని ముంచెత్తదు. కొండమీది నుంచి ప్రవహించే సెలయేళ్లకి అడ్డ కట్టలు కట్టి, నీటిని పొలాల్లోకి మళ్లించుకుంటూ వుంటారు అక్కడి రైతులు. ఈ ప్రవాహాల వల్లనే అక్కడ పంటలు పండేది.

# 4

స్కూలుకి వారం రోజులు సెలవులిచ్చారు. పైనున్న అడవుల దగ్గరకో, కిందనున్న జలపాతాల దగ్గరకో పిల్లలంతా పిక్నిక్‌కి వెళ్లారు. నానా వెంట కానూ, శ్యామ్ ధాన్‌ఖేతనుంచి లైకోక్ శిఖరం మీదనున్న కలప అడితికి చూట్టానికి వెళ్ళారు. తెల్లటి దుంగల్ని పెద్ద పెద్ద రంపాలు 'సర్ - సర్' మంటూ, పొట్టుని దూరంగా విదుపతూ కోయడంచూసి ఎంతో సరదాపడ్డారు. రంపపు పొట్టుని చేతులతో పోగేశారు. పొట్టు చక్కగా గంధంలా వాసనవేసేది.

"కొయ్యలో వుండే నూనెవల్లనే ఆ వాసన. అదే సుగంధం అంటే. కావాలంటే అగ్గిపుల్లలా కాలుతుంది. ఈ పెద్ద పెద్ద చెట్లన్నిటిలోనూ ఎంతో నూనె వుంటుంది. మానుమీద ఎక్కడేనా కాస్త పగులువుంటే, నూనె బయటికి చిమ్మి గడ్డకట్టుకు పోతుంది. అదిగో, తుమ్మజిగురు గుళికల్లాగా మెరుస్తున్నాయే అవే నూనె గడ్డలు. వాటినుంచే అగరు తీస్తారు" అని తీరుబడిగా బోధపరిచాడు రంపం నడిపే మనిషి.

నానాకి కూడా సరదా వేసింది. "అడవుల్లో రేగే మంటలకి కూడా అదే కారణం." శీతాకాలమంతా చెట్లు బాగా ఎండి వుంటాయేమో, మార్చి నెలలో వీసే



గాలికి ఎండు కొమ్మలు ఒకదానికొకటి రాసుకుని మంట పుట్టిస్తాయి. కొండల్లో వుండేవాళ్లకి ఈ అడివి మంటలంటే ఎంత భయమో! నేనూ చూశాను చాలా!'' అందరూ నానా చుట్టూ మూగారు. ''ఏం చూశావు నానా, చెప్పవ్?'' అని అడిగారు.

''గాలి విసురుకి మంట రేగుతుంది. గాలి ఎంత వేగంగా వీస్తే, మంట అంత వేగంగా అడివి అంతా చుట్టబెడుతుంది. మూల మూలలా అంటుకు పోతుంది. రాత్రిళ్లు ఆకాశం అంతా ఎర్రగా తయారవుతుంది. మంటలు ఆర్ప డానికి ప్రజలంతా ఫారెస్టు గార్డులకి సాయం చేస్తూంటారు.''

శ్యామ్‌కి ఈ కొండల్లోకి రావడం ఇదే మొదటిసారి. అడివి మంటలు అతను ఎప్పుడూ చూడలేదు. అందుకే భయపడిపోయాడు. ఆరిపోయిన పెదాలు నాలికతో తడుపుకుంటున్నాడు. ''పల్లెలో వాళ్లంతా మంటల్లో కాలి చచ్చి పోతారా నానా? ఫైర్ ఇంజన్లు వచ్చి మంటలు ఆర్పివేయవూ?'' అని అడిగాడు.

ఫైర్ బ్రిగేడ్ అంటే ఏమిటో కానూకి తెలీదు. ''ఇక్కడి వాళ్లూ, ఫారెస్టు గార్డులూ కలిసి మంట లార్పుతారు. కొమ్మలు విరిచి మంటల మీద బాదుతారు'' అన్నాడు.

రంపం మనిషి అన్నాడు: ''అవును. ఇక్కడ అలాగే ఆర్పుతారు మంటల్ని. ఫైరు ఇంజను రాగలగడానికి ఇక్కడ రోడ్లేవీ? వాళ్ల గొట్టాల్లో నీరు నింపడానికి ఇక్కడ అవకాశమేదీ? మంటలు మేమే ఆర్పుకుంటాం. తరువాత, ఫైర్ లైన్లు ఉండనే ఉన్నాయి.'' శ్యామ్ ఫైర్ లైన్లు చూశాడు. కాని వాటి ఉపయోగ మేమిటో అతనికి బోధ పడలేదు.

నానా బోధ పరిచాడు. ''ఈ మలుపు దగ్గర నుంచి లుంపారింగ్ ఫైర్ లైన్ కనబడుతుంది. కొండ ఈ దిగువ నుంచి ఆ దిగువ దాకా వున్న పట్టీలాంటి ఖాళీ జాగానే ఫైర్‌లైన్ అంటారు. లుంపారింగ్ ఇళ్లకి నిప్పు అంటుకోకుండానే ఈ ఖాళీ జాగా వదిలారు. జాగా బాగా వెడల్పుగా వుంది కనుక మంటలు అవతలి వైపునుంచి ఇవతలికి చేరలేవు.''

"ఈ జాగాలో ఏమీ పెరగనీయరు కనుక మంట అటునుంచి ఇటు వ్యాపించే అవకాశం వుండదు – అక్కడికక్కడే మండిపోవాలి తప్ప! కనుకనే ఈ వైపు ఇళ్ళకి ప్రమాదం వుండదు."

అదివరకు తను చూసిన అడవిమంటలు నానాకి గుర్తుకొచ్చాయి. "పిక్నిక్కి వచ్చే మనలాటి వాళ్ళ మూలానే మంటలు రగులుతూ వుంటాయి. కాల్చిన సిగరెట్లు ఎండుటాకుల మీద పారేస్తే క్షణంలో నిప్పు అంటుకుంటుంది. ఒకొక్కప్పుడు టీ, కాఫీ కాచుకోడానికి మంటచేస్తే, చుట్టుపక్కల వున్న ఎండుటాకులు కూడా మండుతాయి. ఇలాంటివి ఎప్పుడూ జరుగుతూనే వుంటాయి. బుద్ధి తక్కువ మనుషులే దీనికి కారణం."

"అడివి మంటల్ని చూస్తే వణుకూ దడాపుడతాయి. హడలెత్తిపోయిన జంతువులు అటూ ఇటూ దిక్కు తోచక పరుగు లెత్తుతాయి. చిరుతపులి, లేడి ఒకే దారిన పరుగులెడతాయి. ఎవరి ప్రాణం వారికి తీపి. ఎవరూ ఎవరికీ హాని చెయ్యరు. అబ్బ, ఈ మంటల గొడవ చాలింక. ఈ మంటలను గురించి ఆలోచిస్తే నాకు దుఃఖం వస్తూవుంటుంది."

అక్కడనుంచి వాళ్లు 'రోప్ – వే' చూడటానికి వెళ్లారు. కొండమీద కోసిన దుంగలు తాళ్ల సాయంతో కిందనున్న గొదాముకి చేరతాయి. లావాటి ఉక్కు తాళ్లు కప్పీల మీద నుంచి కదులుతాయి. అంత ఎత్తున కరెంటు వుండదు అయినా భూమి ఆకర్షణశక్తి వల్ల ట్రాలీలు కిందికి జారతాయి. దుంగలు తీసేసిన తర్వాత వాటిని గొలుసులతో పైకి లాగుతారు.

తిరిగివస్తూ దారిలో రకరకాల లతలు చూశారు. సిల్వర్ ఫెర్న్ ఆకుతీసి అరచేతి వెనక వైపు నొక్కితే తెల్లని ముద్ర పడింది. అది చూసి కానూ ఎంతో సంబరపడ్డాడు. రంగు రంగుల పువ్వుల్ని చూశారు. వాటి సువాసన మధురంగా వుంది.

చేతుల నిండా పువ్వులు తీసుకుని ఇంటికి చేరి, తల్లి ఒడిలో పోశాడు కానూ. శ్యామ్ తన ఇంటికి పరుగుతీశాడు. తల్లి సంతోషించి, పువ్వులు వాసన చూసి మురిసిపోయింది.

"కానూ, ఈ పువ్వు చూడు ఎంత బావుందో. మీ తాత బర్మాలో ఒక అడివిలో చూశారట ఇలాటిదే ఓ కొత్త పువ్వుని. ఉక్కిరి బిక్కిరి చేసే సుగంధం వచ్చిందట. ఎక్కడిది చెప్మా అని వెదక నారంభిస్తే, ఊదారంగు చుక్కలున్న తెల్ల పువ్వులు కనబడ్డాయట. ఓ పెద్ద చెట్టు వేళ్లదగ్గర కొమ్మలూ లేవు, ఆకులూ లేవు - సరాసరి నేలమీదనే పువ్వులు పూశాయట. చూట్టానికి మైనంతో చేసిన పువ్వుల్లా వున్నాయట" అంది అమ్మా.

"తాతయ్య ఆ పువ్వులు ఇంటికి తేలేదా అమ్మా?"

అమ్మ నవ్వింది. "తెచ్చారు - అమ్మమ్మకోసం. నేలలో వున్న ఉల్లిపాయల లాంటి వేళ్లను కూడా పెకలించి తెచ్చి, తోటలో మామిడిచెట్టు కింద నాటారు. నా చిన్నప్పుడు వాటిని చూసినట్టే జ్ఞాపకం."

"ప్రతి శీతాకాలంలోనూ పువ్వులు పూసేవి. పువ్వులు వాడి రాలిపోయిన తర్వాత, నేలమీద ఏమీ కనబడేవి కాదు. మళ్ళీ వసంతకాలం వచ్చేసరికి ఆకుపచ్చని మొగ్గలు కనబడేవి. నేను కూడా విత్తనం తెచ్చి మన తోటలో నాటాను. కాని ఇక్కడ విపరీతమైన చలి వల్ల చచ్చిపోయింది."

కానూకి దుఃఖం వచ్చింది. "అసలు నువ్వు వాటిని ఇక్కడికి తేకుండా వుండాల్సింది. తెచ్చినా, ఊరవతల ఉండే ఆ దొరగారికిస్తే ఆయన తన 'గ్లాస్ హౌస్' లో పెంచి వుండేవాడు. మన తోటలో సాదా మొక్కలే పెరుగుతాయి."

"అవును నాయనా" అంది అమ్మ - కానూ తెచ్చిన కొత్త రకం లతని తోటలో నాటడానికి వెడుతూ. పనసగవె పక్కన నాటితే రోజంతా చక్కగా వాసన వేస్తూంటుంది మరి.

# 5

ఆ రాత్రి ముల్కిలో ఎవరికీ కంటిమీద కునుకు లేదు. ఒక చిరుతపులి బోనులో చిక్కుకుంది. దాని అరుపులూ, గాండ్రింపులూ రాత్రి అంతా సాగుతూనే వున్నాయి. అంత చలిలోనూ చిన్నపిల్లలు చిరుతపులిని చూడటానికి బయలుదేరారు. తల్లికి ఇష్టం లేకపోయినా కానూ కూడా నానాతో వెళ్ళాడు.

కాగడాల వెలుగులో చిరుతపులి కనబడుతోంది. నిస్సహాయంగా బోనుని పంజాలతో గీరుతోంది. ఆ వెలుగులో దాని కళ్లు భయంకరంగా మెరుస్తున్నాయి. అది ఆడచిరుతే అయినా చాల పెద్దది.

గొర్రె పిల్ల ఎక్కడుందోనని చూశాడు కానూ. కానీ ఎక్కడా కనబడలేదు.



నానాని అడిగాడు. ''చిరుతపులికి ఏం జరిగిందో చూసేదాకా గొర్రెపిల్ల ఇక్కడే వుంటుందనుకుంటున్నావా?''

''వీళ్లు దీన్ని చంపరు కద?''

''ఊహూఁ! దీన్ని జంతుప్రదర్శన శాలకి పంపుతారు. ఇది మాంఛి జాతి చిరుత'' అన్నాడు పక్కనున్న వాచ్ మన్.

''జాగ్రత్త, దగ్గరలో దీని పిల్లలుండొచ్చు'' అన్నాడు నానా.

కానూ ఉత్సాహంగా అన్నాడు: ''చిరుత పిల్లలా? ఎక్కడ?'' నానా జవాబు చెప్పలేదు. చూడడం అయింది గదా. కానూని ఇంటికి తీసుకు చక్కా వచ్చాడు. ఆ రాత్రంతా ఎవరికీ నిద్ర లేదు – చిరుతపులి అరుస్తూనే వుంది. ఓ కోడిపుంజునీ, పాలలో ముంచిన రొట్టెనీ దానికి విసిరారు. అయినా అది ఊరుకోలేదు.

కానూ వణికిపోయాడు. అలాటి జంతువుకి బోనులో బంధించబడ్డ మంటే మాటలా? పైగా, పిల్లలు ఎక్కడున్నారో అనే బాధ ఒకటి!

ఎవరు చూస్తారు దాని పిల్లల్ని?

రెండు రోజుల తర్వాత, నానాకి



అడివి ఇవతల రెండు విచిత్రమైన పిల్లి పిల్లలు దొరికాయి. బొద్దుగా, ముద్దుగా వెన్న ముద్దల్లా వున్నాయి. కళ్లు బంగారంలా మెరిసిపోతున్నాయి. వొంటిమీద లేత నలుపు చుక్కలు కనబడుతున్నాయి. బిల బిలలాడుతూ, 'కుంయ్ – కుంయ్' మంటూ దొర్లుతున్నాయిట. నానా వాటిని ఇంటికి తీసుకొచ్చాడు. అమ్మ చేతిలోకి తీసుకొని వాటిని ప్రేమగా నిమిరింది. గిన్నెలో పాలు పోసి పట్టబోతే, వలక బోశాయి. కానూ చిన్నప్పటి పాల సీసాతీసి దానితో పడితే చక్కగా తాగాయి. గుట గుటలాడుతూ అవి పాలుచప్పరిస్తూంటే కానూ గంతులేశాడు.

ఇంట్లో అందరూ సంబరపడ్డారు గాని పిల్లీ, కుక్క మాత్రం చిర చిర లాడాయి. గొలుసు లేసి కట్టి పడేశారు వాటిని. "జంతువులికి కొత్త వాళ్లంటే కిట్టదు. కాస్త అలవాటయితే ఫర్వాలేదు గాని, చాలా చిత్రంగా వున్నాయీ పిల్లి పిల్లలు" అంది అమ్మ.

నానా గుమ్మంలో నుంచుని అన్నాడు: "అవి పిల్లి పిల్లలు కావు, చిరుత పిల్లలు. పెంచుతారా ఇంట్లోనూ?"

రగ్గు కప్పిన చిరుతపిల్లలు వెచ్చగా పడుకున్నాయి. రెండూ రెండు ఊలు బంతుల్లా వున్నాయి. అమ్మ విస్తుపోయింది. "అందుకేనన్నమాట చిరుతపులి రాత్రి తెల్లవార్లూ అలా అరిచింది. ఫారెస్టు ఆఫీసర్లు తల్లి దగ్గరికి చేర్చ గలిగే దాకా వీటిని పెంచుదాం మనం."

కానూకి నిరాశ అయింది. "జంతు ప్రదర్శనశాలలో బోనులో బంధించే బదులు మనమే ఇక్కడ వాటిని పెంచుకోకూడదూ?"

లైకోర్ నుంచి రోజూ పొద్దున్నే పాలు తెచ్చే ముసిలి మనిషి ఈ చిరుత పిల్లల్ని చూసి ముక్కున వేలేసుకున్నాడు. తన వెదురు పాలగిన్నెని కింద పెట్టి మాట్లాడ్డం మొదలుపెట్టాడు.

"ఇదెక్కడా వినలేదు. చిరుతపులి పిల్లల్ని ఇంట్లో పెంచడమేమిటో! ఇలాంటి క్రూర జంతువుల్ని ఎవరూ లొంగదీసుకోలేరు. ఇలాగే నేనోసారి అడివి మంటల్లోంచి ఓ పిల్లిపిల్లను తీసుకుని ఇంటిదగ్గర పెంచడం ఆరంభించాను. అది

ఇంతై, అంతై పెద్దదయింది. తిండి కూడా గట్టిగా తినడం మొదలెట్టింది. మా అమ్మకి, ఆవిడకి దీన్ని ఏం చేయాలో బోధపడలేదు. కాని ఇంట్లో అందరికీ అదంటే ఎంతో ఇష్టమైపోయింది. ఆ తర్వాత దాని వొంటిమీద నల్లని చుక్కలు, పచ్చని నూగు రావడం మొదలెట్టింది. అది ఏ జంతువో అప్పుడు అందరికీ అర్థం అయింది.”

“ఓ రోజున పొద్దున్న ఏం చేసిందంటే, మా కోడిపెట్టను పొట్టని పెట్టుకుంది – ఎముకలు, ఈకెలు కూడా మిగలలేదు. మా ఆవిడకి కోపం వచ్చి, దాన్ని రాత్రంతా - వాకిట్లో కట్టి పడేసింది. మర్నాడు ఉదయం పాపం ఎలా వుందో అని చూడ్డానికి, వెడితే ఏం వుందీ? రాటకి కట్టిన పలుపుతాడు కొరికేసి



పారిపోయింది. ఇంట్లో వున్న చిన్న మేకపిల్ల కూడా కనిపించలేదు. మేకపిల్ల తాలూకు అజపజా కూడా ఏమీ దొరకలేదు. సరె, చిరుతపిల్లని గురించిన వైనం అసలే తెలీలేదు. ఇలాటి క్రూర జంతువుల్ని మనం పెంచలేము, మచ్చిక చెయ్యలేము.''

నానా కానూకి పెద్ద చెట్టు చిటారి కొమ్మన వున్న తేనెపట్టు చూపించాడు. చిరుత పిల్లల్ని గురించి కానూ మర్చిపోవాలనే నానా ప్రయత్నం. ఫారెస్టు శాఖ పనివాళ్లు అంత క్రితమే చిరుత పిల్లల్ని తల్లి దగ్గరకి తీసుకుపోయారు. చెట్టుమీద నున్న తేనెపట్టు గుండ్రంగా పెద్ద బంతిలా వుంది. రోజు రోజూ పెరుగుతోంది. కానూ ఒకసారి చూశాడు - పెద్దపట్టు నుంచి ఒకటి రెండు చుక్కల తేనె నేలమీద పడడం, దాని చుట్టూ నల్ల చీమలు చేరడమూను.



ఇలా వుండగా ఓసారి మాలీని తేనెటీగ కుట్టింది. పాలమనిషి అమ్మని హడలగొట్టేశాడు – ఇక కొద్ది రోజుల్లో ఇంట్లో ఎవరూ ఉండలేరని హెచ్చరించాడు. తేనెపట్టు తీసి కాల్చేయాలన్నాడు. ఇది వినేసరికి నానాకి మంటెత్తుకొచ్చింది. వాటిని ఏమేనా చేస్తే తప్ప తేనెటీగలు మనుషుల్ని ఏమీ చేయవు. ఆ చెట్టుకి మాలీ బట్టల దండెం కట్టకుండా ఉండాల్సింది.

అమ్మ అంగీకారంతో పాలవాడు ఆ రోజు రాత్రి తన ఊరునుంచి కొందరు మనుషుల్ని తీసుకొచ్చాడు. పెద్ద కాగడా తయారుచేసి, దాన్ని ఓ గెడకి కట్టాడు. దానితో మంటకి నిప్పు పెట్టాడు. దానినిండా మైనం వుంది కనక మహా జోరుగా మండింది. రాత్రి చీకటిలో తేనెటీగలు అటూ ఇటూ ఎగిరిపోయాయి. కొన్నిటికి రెక్కలు దెబ్బతిని వాలిపోయాయి. పుట్ట పుట్టపడంగా నేల కూలింది. ఆ మనుషులు నిప్పు ఆర్పేసి, పుట్ట తీసుకుని వెళ్లిపోయారు. కానూ చాలా పేచీ పెట్టాడు. పాలు ముట్టుకోనని భీష్మించుకు కూర్చున్నాడు.

నానా కానూని కేకలేశాడు – అతను చీమల పుట్టలో నీళ్లుపోసి చీమల్ని హింసించిన సంగతి జ్ఞాపకం చేశాడు. కానూ చీమల గురించి కూడా ఏడ్చాడు. నానా కూడా బాధపడుతున్నాడని తెలుసు కానూకి.

"సాలెపురుగులు మహా చెడ్డవి, పురుగుల్ని తినేస్తాయి. పిట్టలూ చెడ్డవే, సీతాకోకచిలుకల్ని తినేస్తాయి."

నానా అన్నాడు: "చిన్న పిల్లలూ అంతే. చేప పిల్లల్నీ, కోడిపెట్టల్నీ, మేక పిల్లల్నీ తినేస్తారు. అందరూ ఏదో ఒక జీవిని తింటూనే వున్నారు. ఇంక చాలు, లే. పాలు తాగి నిద్రపో."



# 6

చాలా రోజుల వరకూ కానూ చిరుత పిల్లల్ని మరచిపోలేదు. పెంపుడు పిల్లి, కుక్క మాత్రం పీడా పోయిరి అనుకుని వుంటాయి. గదులన్నీ దొల్లుతూ గెంతుతూ, చిరుత పిల్లలుండిన చోట ముక్కుతూ గడుపుతున్నాయి. అమ్మకి తెలుసు కానూ హృదయం.

"సర్వే పార్టీవాళ్లు గారో కొండల దగ్గర పట్టుకున్న ఏనుగు గున్న గురించి చెప్పనా నీకు?" అంది అమ్మ.

ఇదేదో కథ అనుకుని కానూ అమ్మ దగ్గరగా జరిగాడు. "చెప్పలేదు. ఏనుగు గున్న ఎక్కడుందిప్పుడు?"

"ఎక్కడో సుఖంగానే వుండి వుండాలి – గట్టిగా చాకిరీ చేస్తూ, ఏనుగులు చాలా ఖరీదు కనక వాటిని గురించి చాలా జాగ్రత్త తీసుకుంటారు."

ఆ సర్వేపార్టీ బాపూ ఉన్న పార్టీయే. "బాపూ చూశాడా దాన్ని?" కానూ అడిగాడు. "చూశారు. అసలు వాళ్లు ఏనుగుని పట్టడానికి వెళ్ళలేదు. కొండలూ, వాగులూ కొలుస్తున్నారట. ఓ రోజు ఇంటికి తిరిగొస్తూ, ఓ ఏనుగు వాళ్ళని తరిమిందని చెప్పుకున్నారట. 'ఏనుగుల మంద వుందా, ఒక్క ఏనుగే వుందా' అని అడిగారట బాపూ. 'ఒక్క ఏనుగే, మందలేదు' అన్నారట పనివాళ్లు ఒంటరిగా వుండే ఏనుగు పొగరుగా వుంటుందనీ, ప్రమాదకరమనీ వాళ్లకి తెలుసు. తుపాకులు తీసుకొని ఇద్దరూ, ముగ్గురూ కలిసి వెళ్లేవారట.

"ఆ మర్నాడు, ఆ ఏనుగు మళ్లీ ఎదురుపడిందట. వాళ్లు దాని మీద తుపాకి పేల్చారట. అది రోడ్డు మీద నుంచి పక్కకి దొర్లి పడిపోయిందిట. మర్నాడు ఆ దారిన వెళ్లే వాళ్లకి మళ్లీ ఘీంకారం వినబడేసరికి ఆశ్చర్యం వేసిందట. కొందరు మనుషుల్ని వెంట పెట్టుకుని బాపూ అక్కడికి వెళ్లారు. అక్కడొక ఏనుగుగున్న తల్లిని కదపడానికి ప్రయత్నిస్తోందట. దానికి కాలిమీద దెబ్బ తగలడం మూలాన కొంచెం కుంటుతోందిట."

"ఈ సర్వేపార్టీ వాళ్లు తన గున్నని ఏం చేస్తారో అనే భయంతోనే ఆ ఏనుగు వీళ్ళని హడలెత్తించి వుంటుందని బాపూ గ్రహించారు. 'పాపం' అనుకున్నారట అందరూ. ఏనుగుగున్న కాలికి కట్టుకట్టి, దాని కిన్ని చెరుకు గడలు పడేశాడట తినడానికి. తర్వాత దాన్ని కేంద్రానికి తీసుకొచ్చి మచ్చిక చేశారట. మొదట్లో ఎవరేనా ముట్టుకుంటే సహించలేక పోయేదట. అప్పుడు తల పగిలి పోయేటంత గట్టిగా నవ్వుతున్నట్టు ఘీంకరించేదట. తర్వాత తర్వాత దారిలోపడి, చిన్న చిన్న బరువులు లాగడం మొదలెట్టిందట. అందరితోనూ సరదాగా వుంటూ, పొద వెనకనుంచి ఇవతలకొచ్చి ఎవరుంటే వాళ్ళని తొండంతో ఒక్క తోపు తోసేదట. పెద్ద పెద్ద ఏనుగులు ఎంత సుతారంగా, నిశ్శబ్దంగా కదులుతాయో తెలుసా నీకూ? గున్నకి రఘువీర్ అని పేరు పెట్టారు. అది ఇప్పటికీ వాళ్ళ దగ్గరే వుంది."

కథ అంతం బాగానే వుందిగాని, కానూకి తల్లి ఏనుగుని తల్చుకునేసరికి జాలి పుట్టింది. "పిల్లని రక్షించుకోడం కోసం సర్వేవాళ్ళని చంపడానికి పూనుకుంది, అది మరచిపోకు" అన్నాడు నానా. "రా, రా, ఇప్పుడు నీకో కొండముచ్చు కథ చెబుతాను, బాగుంటుంది" అన్నాడు.

"కాశీలో జరిగింది ఈ కథ. ఇక్కడ నుంచి కొందరు యాత్రికులతో మా అమ్మ కాశీ వెళ్ళింది. ఆ జనం, ఆ తొక్కిడి, నది దగ్గర ఘట్టాలు, వందలాది పడవలు, మిఠాయిలు అన్నీ చూసేసరికి వీళ్లకి ఆశ్చర్యం వేసింది. అక్కడ వీళ్ళంతా ఊరు చూడ్డానికి బయలుదేరారు. అన్నీ బాగానే వున్నాయి." ఈ కొండముచ్చు లొక్కటి తప్ప. ఎక్కడ చూస్తే అక్కడ అవే మందలు మందలుగా! ఇళ్ల వాకిళ్లలో తీగె చుట్టించుకున్నారు చాలామంది కోతులు లోపలికి రాకుండా. అందరూ వీటిని 'ఆంజనేయుల్లు' అనేవారు. అవి పవిత్రమైనవిట. అందుకని ఎవరూ వాటిని ఏమీ చేసేవారు కారు.

చెట్లనుంచి పళ్లు కొరికేస్తాయి, ఆరవేసుకున్న బట్టలు ఎత్తుకుపోతాయి, చిన్న పిల్లల్ని బెదిరిస్తాయి - ఇవన్నీ వాటికి వినోదం కాబోలు. యాత్రికులు మాత్రం మహా బెదిరిపోయారు. ఒక రోజున పొద్దున్న హఠాత్తుగా అరుపులూ, కేకలూ



వినబడ్డాయి. ''ఆంజనేయుళ్లు'' వాళ్లలో వాళ్లు తగువుపెట్టుకున్నారు. మా అమ్మ, మిగతావాళ్లూ లోపల దూరి తలుపులు వేసుకోబోతూండగా, ఓ పెద్ద కోతి ఒక్క ఉదుటున వచ్చి, తన పిల్లని మీ అమ్మ చేతుల్లో వుంచింది. వెంటనే గోడ ఎక్కి ఎక్కడికో మాయమయింది.

''పాపం చిన్నపిల్ల... బహుశా నెల గుడ్డేమో. ఏమీ తినలేకపోయింది. పాలు



తడిపిన గుడ్డే అందిస్తే చీకగలిగింది. అందరూ దాన్ని మచ్చిక చేశారు. ఆ వెంటనే అది నిద్రపోయింది.

"ఆ సాయంకాలం పెద్ద 'ఆండ నేయులు' గుమ్మంలోకి వచ్చేసరికి మా అమ్మ హడిలిపోయింది. తలుపు దగ్గర నిటాగ్గా నిలబడి, మనుషుల్లాగా రెండు చేతులూ చాచింది.

మా అమ్మ కోతిపిల్లని దానికి అందించేసరికి, అది పిల్లని పొట్టకి కరిపించుకుని ఒక్క ఉదుటున గోడ ఎక్కి అటే ఎటో వెళ్ళిపోయింది.

"ఎందుకలా చేసింది నానా?"



"మగకోతులు కోపంలో వున్నప్పుడు చిన్న కోతుల్ని పట్టి పీకిస్తాయి. ఇది కాకపోయినా, శత్రువూక ఏదేనా ఈ కోతుల గుంపుమీద దాడిచేసి వుండచ్చు. తల్లి కోతికి తక్షణం తన పిల్లని మనుషుల చేతిలో పెడితే ప్రమాదం తప్పుతుందని తోచింది. కథ ఎలా వుంది నీకు?"

"బాగుంది" అన్నాడు అమ్మని కౌగలించుకుంటూ.

'అమ్మలు ఎంత మంచివాళ్లూ!' అనుకున్నాడు.

# 7

రోజులు గడిచేకొద్దీ చలి ముదరసాగింది. గాలి స్వచ్ఛంగా వుంది. రాత్రిళ్ళు ఆకాశం బోర్లించిన గిన్నెలా కనబడేది. నీలం నీలంగా ఆకాశం, మధ్య మధ్య మినుకు మినుకుమనే నక్షత్రాలు, గ్రహాలకి స్వయంగా వెలుగులేదు, సూర్యుడి ప్రకాశంతోనే వెలిగేవి. అమ్మ వాటిని ఒక్కొక్కటీ వివరంగా చూపించేది. నక్షత్రాలు అలా కాదు, సొంతంగానే మెరుస్తాయి. "అవి కూడా ఒక రకమైన సూర్యుళ్ళే. వాటి గ్రహాలు వాటికున్నాయి" అంది అమ్మ.

"నీ చిన్నప్పుడు సోనాలీనుంచి వాటిని చూసేదానవా అమ్మా?"

"అక్కడ నుంచి కూడా ఈ నక్షత్రాలనీ, గ్రహాలనీ చూసేదాన్ని. గమ్మత్తుగా లేదూ? ఇప్పుడు కూడా అమ్మమ్మ వాటివైపే చూస్తూ మన్ని తలుచుకుంటోం దేమో!"

"ప్రపంచంలో అందరూ ఇవే నక్షత్రాలని చూస్తారా అమ్మా?"

"కాదు నాయనా, ప్రపంచంలో ఉత్తర భాగంలో వుండేవాళ్ళే. దక్షిణ భాగంలో వాళ్ళు మరో నక్షత్రాలను చూస్తారు. మా ఊళ్లో ఆకాశం ముదర నీలంగా కనబడుతుందా, ఇక్కడ ముదురు ఊదారంగుగా వుంటుంది. 'పాల పుంత' అంటారే అదే; చూడు. దానిలో లక్షలాది నక్షత్రాలుంటాయి. మేము దాన్ని 'ఆకాశగంగ' అనే వాళ్ళం."

"అన్నీ అంతటా ఒకేలా వుంటాయి కాదమ్మా" కానూ ఆశ్చర్యంగా అడి గాడు.

"అవును కానూ!"

"మరి నీకు ముల్కి కంటే సోనాలీ అంటే ఎందుకంత అభిమానం?"

"నేనక్కడ పుట్టాను, మా అమ్మ అక్కడ వుంది కనక!"

"నువ్వు అభిమానించేది సోనాలీనా? మీ అమ్మనా?"

"ఎందుకురా అతిగా వాగుతావు!" అని మందలించింది అమ్మ. కాని అమ్మ ముఖంలో చిరునవ్వు కనబడింది.

చలి ముదిరేకొద్దీ, చెట్ల ఆకులు రాలడం మొదలైంది. మొదట, ఆకుపచ్చల్లా పసుపురంగు అయ్యేవి, తర్వాత బూడిదరంగు కనబడేది. ఉత్తరాన్నుంచి చిరు గాలి వీచినా ఆకు రాలిపోయేది. అటూ ఇటూ ఎగిరి చెట్ల కింద పోగు పోగులుగా వుండేవి – పచ్చనివి, బూడిద రంగువి, బంగారం రంగువి, ఎర్రటివి, కొన్ని నల్లటివి కూడా కనబడేవి.

మాలీ తన పెద్ద గంప తెచ్చి రాలిన ఆకులన్నీ కుప్పలు కుప్పలుగా పోగేసే వాడు. తోట శుభ్రంగా వుంచేవాడు. చిన్న కుప్పలన్నీ, ఓ పెద్ద పోగుగా పోగు



చేసేవాడు – ఇంటికి దూరంగా. నానా కానూని పిలిచి "రా, రా ఇప్పుడు చలి మంట వేద్దాం" అన్నాడు. చీకటి పడుకోందనగా ఎండుటాకులిని మాలీ మంట బెట్టాడు. క్షణంలో అంత ఎత్తున లేచింది మంట. చెట్టమీద నున్న పిట్టలకి ఇది కిట్టలేదు, గట్టి గట్టిగా అరుచుకుంటూ చీకటిలోకి ఎగిరి వెళ్లిపోయాయి.

నానా నవ్వాడు. "అప్పుడే తెల్లారి పోయిందను కుంటున్నాయి కాకోలు" అన్నాడు కానూ.



"కాదు, అడివి మంటలనుకుంటాయి" అన్నాడు నానా.

అమ్మకి కొంచెం భయమేసింది. "చూరుగాని అంటుకోదు కద ?"

"ఆ భయం లేదు. ఒకవేళ మంట అలా విసిరినా, మాలీ తయారుగానే వున్నాడు బాల్చీడు నీళ్లు పట్టుకుని. మరేమీ భయం లేదు" అన్నాడు నానా.

అందరూ మంటచుట్టూ నిలుచున్నారు. అందరి ముఖాలూ మంటలో వెలిగిపోతున్నాయి. బుగ్గలు వేడెక్కి ఎర్రబడ్డాయి. కాని వీపుకి మాత్రం చలి తగులుతోంది. ఆ ప్రాంతంలో వున్న పిల్లలు మంట చూసి పరుగెత్తుకొచ్చారు. చుట్టూ చేరారు. పెద్ద వాళ్లు కూడా కొందరు వచ్చారు. ధాన్‌ఖేతీ నుంచి శ్యామ్‌తో బాటు అతని తండ్రి కూడా వచ్చాడు.

అమ్మ లోపలికెళ్ళి తను చేసిన బిస్కట్లు తెచ్చి పిల్లలకి పెట్టింది. పెద్దవాళ్ళకి టీ తయారుచేసి ఇచ్చింది. శ్యామ్ తన తండ్రి దగ్గర టీ తాగడం చూసి, కానూ కూడా నానా గ్లాసులోంచి రెండు మూడు గుక్కల టీ తాగాడు. అమ్మ చూసింది. "పెద్దవాళ్ళ గ్లాసుల్లోంచి పిల్లలు తాగకూడదు" అని చిన్న కప్పుల్లో టీ తెచ్చి పిల్లలకి కూడా ఇచ్చింది.

అందరికీ చాలా సరదాగా వుంది. నెమ్మదిగా మంటలు తగ్గాయి, నిప్పు ఆరిపోయింది. అందరూ 'అమ్మయ్యో, చలి!' అన్నారు. నమస్తే నమస్తే అంటూ ఒకరి వెనక మరొకరు వెళ్లిపోయారు. కానూ, నానా, అమ్మ ఇంట్లోకి వెళ్లారు. వాళ్ల బట్టలు కాలిన ఆకుల వాసన వేస్తున్నాయి. కొంచెం అలసటగా వున్నా ఉల్లాసంగా వున్నారు. తోటలో పండిన కాలీఫ్లవరు కూర పూరీలు తిన్నారు.

"మైదానాల్లో ఎప్పుడూ ఇంత చలిగా వుండదు. శీతాకాలం ఎప్పుడొస్తుందా అని ఎదురుచూస్తారు. ఇక్కడ చలిగాలికి పువ్వులు వాడిపోతాయి. అక్కడ చలికాలంలో పువ్వులు విరగబూస్తాయి. పెద్ద పెద్ద చెట్లు అక్కడ కూడా ఆకు రాలుస్తాయి, ఇక్కడ మన రేగి చెట్లలాగానే. శీతాకాలం ఆఖరున పువ్వులు పూస్తాయి. పువ్వుల పుప్పొడి చిన్న చిన్న కుప్పలుగా చెట్ల మొదట్లో పడి

వుంటుంది. దక్షిణ తెరిపి గాలి వీచేసరికి పుప్పొడి ఎగిరి, మనుషులు తుమ్మడం ఆరంభిస్తారు. పువ్వులు చక్కటి వాసన వేస్తాయి. ఇక్కడ అలాటి పువ్వుల వాసన లేనేలేదు!''

కానూకి ఈ మాట నచ్చలేదు. ''మన రేగిచెట్ల పువ్వులు కూడా అలానే వుంటాయి కాదూ - తెల్ల తెల్లగా ఎంత బావుంటాయో. శీతాకాలం అయిపోయే సరికి అన్నీ పువ్వులే, ఒక్క ఆకు కూడా కనబడదు. అవునా నానా?''

నానా అవునన్నాడు. ''పూరేకులు రాలిపోతాయి, చిన్న చిన్న రేగికాయలు తొంగిచూస్తాయి. ఎంత గట్టిగా, చేదుగా వుంటాయో! లేత ఆకులు మొలిచి చిన్న కాయల్ని కప్పుతాయి - చలి తగలకుండా. కాయలు పెద్దవయ్యేకొద్దీ కొమ్మలు బరువెక్కి కిందికి వాలతాయి. చూశావా కానూ? కాయ పండబారడానికి కొన్ని నెలలు పడుతుంది - చలి కదా మరి!''

''సోనాలీలో మామిళ్ళు కూడా అంతే. పూత పూసిన తర్వాత, ఆకులు చిగురిస్తాయి. చిన్న పిందెలకి ఎండదెబ్బ తగలకుండా, పిల్లలు విసిరే రాళ్ళు తగలకుండా కాపాడతాయి. అక్కడ వేడిగా వుంటుంది కనుక మూడు నాలుగు నెలల్లో కాయలు పరువుకొస్తాయి. ప్రతి చోటా అంతే. ప్రకృతి తన సృష్టిని ఎంతో జాగర్తగా చూసుకుంటుంది. చలి ఎక్కువగా వుండి, నీరు గడ్డకట్టుకుపోయే చోట, జంతువులు కన్నాల్లో దూరి నిద్రపోతాయి. వేళ్ళు నేలలో దూరిపోతాయి. పిట్టలు వెచ్చని ప్రాంతాలకి వలసపోతాయి. సోనాలీవైపుకి ఎన్నివేల పిట్టలు వస్తుంటాయో- రక రకాల పిట్టలు! ఊరి చుట్టూవున్న కొలనుల్లో, కాలవల్లో శీతాకాలమంతా గడిపి, చలి పోగానే వెనక్కి వెళ్ళిపోతాయి'' అంది అమ్మ.

''రా, కానూ, ఇక నిద్రపోవాలి నువ్వు.''

# 8

క్రమేణా పగలు తక్కువయింది. మధ్యాహ్నం నాలుగున్నరకే చీకటి పడి పోయేది – త్రికోర్ శిఖరం పైన సూర్య కిరణాలు కొద్ది కొద్దిగా కనబడినా "సూర్యుడు నిజంగా అస్తమించలేదు, కొండల వెనక్కి వెళ్ళాడంతే" అన్నాడు నానా.

రాత్రిళ్ళు అంతం లేకుండా వున్నట్టు వుండేవి. చేపలు పట్టడానికి, గాలిపటాలు ఎగరేయడానికి చాలా చలిగా వుండేవి. నానా తన వడ్రంగి సామాను పెట్టె తెచ్చి, చేతికర్రలకి కుక్క ముఖాలూ, భూతం ముఖాలూ ఎలా తయారు చేయడమో కానూకి నేర్పేవాడు.

పరీక్షలు అయిపోయినయి. శీతాకాలం సెలవులిచ్చారు. చలిబాధ తప్పించుకోడానికి కొందరు మైదాన ప్రాంతాలకి వెళ్ళిపోయారు. నానకి, కానూకి కొండల్లో కురిసే మంచంటే ఎంతో ఇష్టం. పొద్దున్నప్పుడు చూస్తే సరదాగా వుంటుంది అంటారు.

"ఆకాశంనుంచి మంచు కురవడం నేనెప్పుడూ చూడలేదు. నేను నిద్ర పోయేటప్పుడు రాత్రి కురుస్తుందా?"

నానా అన్నాడు: "మన కొండలు తెల్లని మంచు కురిసేటంత ఎత్తుగా లేవు. అది హిమపాతం. ఇది బిందువులుగా నేలమీదపడి గడ్డకడుతుంది" సూర్యరశ్మి సోకేసరికి అవి కరిగిపోతాయి.

ఒక దుంగ కాలేసి చుట్టూ కూర్చుని భోజనాలు చేశారు. వెచ్చ వెచ్చగా హాయిగా వుంది. దుంగ కాలుతూంటే కానూ కలలు కనడం మొదలుపెట్టాడు. అతని మనసులో ఊళ్లకి ఊళ్ళు తగలబడిపోతున్నాయి; హోరా హోరీన యుద్ధాలు జరిగిపోతున్నాయి, అడివి మంటలు ఆకాశాన్నంటుతూ మండిపోతున్నాయి. కొండలు మండుతున్నాయి. మండే ద్రవం కిందికి ప్రవహిస్తోంది. ఇలాటి కొండల్నే 'అగ్ని పర్వతాలు' అంటారు. నానా చూశాడట అగ్నిపర్వతాన్ని.



బాపూ దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది. శీతాకాలంలో వస్తానని వ్రాశాడు. రెండు నెలలు సెలవుపెట్టి ఇక్కడ గడుపుతాడట. అందరికీ ఎంతో సంతోష మయింది. పోస్ట్‌మాన్‌కి అమ్మ టీ ఇచ్చింది, మిఠాయి పెట్టింది. మాలీకి మేన మామ అతను. ముల్కిలోవున్న ప్రతి ఇంట్లోనూ అతనికి స్నేహితులే. అందుకే ఉత్తరాలు ఇవ్వడానికి ఆలస్యం అయేది. అతని పేరు డొరేన్, అతన్ని చూసి నానా అనేవాడు: "పొట్ట నిండుగా వుంటే, ఎంత చలిఅయినా కొండమీది కొస్తాడులే."

అడవిలో తేనెపట్టును గురించి కానూకి చెప్పింది డొరేనే. ఓ రోజు ఉదయం తేనెటీగలు ఎగరడం చూశాడట. వెంటనే కానూకి చెప్పాడు. రెండు రాణి ఈగలు ఒక పట్టులో వుండలేవట. ఒక్క రాణి ఈగ, కొన్ని సోద ఈగలు, వేలకొద్దీ పని ఈగలు వుంటాయిట. ఈ పని ఈగలే పువ్వుల నుంచి పుప్పొడి తేవడం, పట్టుకోసం మైనం తయారుచేయడం, పిల్ల ఈగల కోసం తేనె చేయడం,

పట్టు శుభ్రంగా వుంచడం మొదలైన పనులు చేస్తాయిట. రాణి-ఈగ గుడ్లు పెట్టడం తప్ప మరేమీ చేయదట.

గుడ్లు రక్షించుకోవడం గాని, పిల్ల ఈగల్ని సాకడం గాని రాణి ఈగ చేయదు. అన్నీ పని-ఈగలే చూసుకుంటాయి.

ఎప్పుడేనా పట్టు కిక్కిరిసి పోయినట్టుంటే, కొన్ని సారద ఈగల్నీ, ఓ జట్టు పని ఈగల్నీ వెంటపెట్టుకుని మరో చోట పట్టు నిర్మించుకోడానికి రాణి ఈగ లేచి చక్కా పోతుంది.

అమ్మకి తెలుసు ఈ సంగతులన్నీ. సోనాలీ దగ్గర ఓ తేనెపట్టు చూసింది అమ్మ. మధ్య తొర్రవున్న చెట్టు అది. ఆకులేమీ లేవు. మాను కూడా పగుళ్ళు చూపింది. లోపలనుంచి తేనెపట్టు కనబడుతూనే వుంది. ఒక్కొక్కప్పుడు తేనె బయటికి చింది మాను వెంబడే కారిపోయేది. కాగే తేనె చుట్టూ చీమలు చేరేవి. తేనెపట్టుకి మరీ దగ్గరగా వెళ్ళడానికి చీమలు ఎన్నడూ సాహసించవు. ఏమంటే తేనెటీగలు మీదబడి చంపుతాయి.

కానూ ఉత్సాహంగా వింటున్నాడు. తేనెపట్టు చూడాలనిపించింది అతనికి. "అమ్మా, మనం సోనాలీ వెడదామా?" అని అడిగాడు.

పక్కన కూర్చున్న నానా అన్నాడు: "అంతదూరం వెళ్ళడమెందుకూ? అడివిలో వుంటాయి. నేను చూపిస్తానులే. కాని శీతాకాలంలో తేనెటీగలు బయటికి కదలవు. వసంతకాలం వచ్చాక వెళ్లి చూదాంలే."

కానూ అప్పటివరకూ ఆగలేదు. "ఇప్పుడే వెళ్లి తేనెపట్టున్న చెట్టు చూసి వద్దాం. వసంతం వచ్చాక తేనెటీగల్ని చూడొచ్చు."

అమ్మ వొప్పుకోలేదు. "పుట్టున్న చెట్టునేం చూస్తావూ, తేనెటీగల్ని చూడాలి గాని!" అంది.

కొన్ని రోజులు గడిచాయి. బాగా వెచ్చగా వున్న ఒక మధ్యాహ్నం భోజనాలుచేసి అమ్మ మిగతావాళ్లు విశ్రాంతి తీసుకుంటున్నారు. పోస్టులో బాపూ పంపిన పెద్దపులి బొమ్మల పుస్తకాన్ని తిరగేస్తున్నాడు కానూ.



చెవుల కంటా మూసే ఉన్ని టోపీ వేసుకున్నాడు నానా. బరువుగా నల్లగా వుండే పెద్ద ఉన్ని కోటు వేసుకున్నాడు. తన చేతికర్ర తీసుకున్నాడు. నానాని చూసి కానూ లేచి కూచున్నాడు.

"ఎక్కడి కెళుతున్నావు నానా, నేనూ రావొద్దూ ?"

"వద్దు, వద్దు. అడివిలోని నీటి ఊటల్ని చూడ్డానికి వెళుతున్నాను. నువ్వు ఎప్పుడో చూశావు వాటిని."

"నువ్వు మాత్రం చూడలేదూ ?" అని అడిగాడు కానూ.

''అవును ఎన్నేళ్ళో ఆ నీటి ఊటల దగ్గరే గుడిసెలో వుండేవాణ్ణి - నీటిని ఎవరూ పాడుచేయకుండా చూసేవాణ్ణి. ఇప్పుడు ఊట చుట్టూ గోడ కట్టేశారు. అందుకని ఎవరూ కాపలా కాయనక్కరలేదు. పదేళ్ళయింది ఆ మూలకి వెళ్ళి. బాగా పాడయిపోయి వుంటుంది.... సరె, నువ్వు పడుకో – అమ్మ కేక వేస్తుంది'' అంటూ వెనక్కి చూడకుండా చురుగ్గా నడిచి వెళ్ళిపోయాడు.

... అడివి చేరబోతుండగా కానూ నానాని కలుసుకున్నాడు. ఇతన్ని చూసేసరికి నానాకి విపరీతమైన కోపం వచ్చింది. వెంటనే వెనక్కి తిరిగి ఇంటి ముఖం పట్టాడు. నానాని చూడనట్టే కానూ అడివివైపు నడవసాగాడు. నానా ఇంటికి తిరిగి వెళ్ళిపోదలచుకుంటే వెళ్ళ మను, తనుమాత్రం తేనే పట్టున్న చెట్టును చూట్టానికి వెడుతున్నాడు! చివరకి, నానా కానూతోనే వెళ్ళాడు.

''అమ్మ ఏం కసురుకుంటుందో గాని!'' అన్నాడు నానా. కానూ అన్నాడు: ''అమ్మకి ఎందుకు కోపం



వస్తుందీ ?'' చలి తగలని పెద్ద కోటు తొడుకున్నాను. వెచ్చగా వుండే మేజోళ్ళు వేసుకున్నాను.'' ఓ పిక్‌నిక్ పార్టీతో కలిసి ఎప్పుడో ఒకసారి ఇక్కడికి వచ్చాడు కానూ. ముల్కిలో వాళ్ళంతా ఇక్కడే వున్నారు ఆవాళ. అందరూ ఆటలు ఆడుకున్నారు. పాటలు పాడుకున్నారు. కథలు చెప్పుకున్నారు. ఇప్పుడు ఏమిటోలా వుంది. అడవి మరీ గుబురుగా వున్నట్టుంది. చెట్లు మరీ దగ్గర దగ్గరగా వున్నాయి. మధ్యాహ్నం ఎండ బయట ఎక్కడో పడుతోంది. ఇక్కడ కొమ్మల మధ్యనుంచి కొద్ది కొద్దిగా తొంగి చూస్తోంది అంతే. అంతా కొత్తగా వుంది – చలి ఎక్కువగా వుంది.

కోటు లోపలే వణికిపోతున్నాడు కానూ. కింద నేల తడితడిగా వుంది. చెట్ల మీదనుంచి వేలాడే చిత్ర విచిత్రమైన లతలూ ఆకులూ ముసిలివాళ్ళ ముఖాలుగా, మాసిన గడ్డాలుగా కనబడుతున్నాయి.



"అవి కూడా మొక్కలే, నేలనుంచి సరాసరి తీసుకోడంకంటే, ఇవి చెట్లవేళ్ల నుంచి శక్తిని తీసుకుంటాయి.. ఆఁ! పొదలకి దగ్గరగా వెళ్లకు... ఏదేనా పడగ ఎత్తవచ్చు" అన్నాడు నానా. అడివిలో వుండగా 'పాము' అనే మాట అనడం నానాకి ఇష్టం లేదు.

"మరి, శీతాకాలమంతా నిద్ర పోతాయన్నావు కదూ?"

"ఎవరేనా తోక తొక్కితే కాదు... నడు, ఇంక పోదాం" కానూ పొదలకి దూరంగా నడుస్తున్నాడు.

కానూ ఒక్కసారి చెవులు నిక్కించాడు. ఎక్కడో నీరు జారుతున్న చప్పుడు వినబడింది. అడివిలో రకరకాలు చప్పుళ్లు – చిటారి కొమ్మ నున్న పిట్టల అరుపులు, కొమ్మల సందులోంచి వీచే గాలి చప్పుడు, ఆకులమీద అడుగుల చప్పుడు, పురుగుల రొద, అన్ని చప్పుళ్లకంటే నీరు జారే చప్పుడే కానూకి ఇష్టం. దూరా న్నుంచి కూడా ఈ చప్పుడు వినబడుతుంది. "నానా, నీటి ఊట వుంది దగ్గరలో!" అన్నాడు కానూ.

"ఊటలు పై నుంటాయి బాబూ. గొట్టాల్లోకి వెళ్లలేని నీరు బయట పడిపోతుంది – అదీ ఆ చప్పుడు. కొండల మీద నుంచి కిందికి పడే ఊట నీరే అది. కిందికిదిగి బడాపానీలో చేరుతుంది. ఎలా గల గల చప్పుడు చేస్తూ, కేరింతాలు కొడుతూ కిందికి దూకుతుందో! ఉరుకుతూ పడే నీటికి రాళ్లు కరుగుతాయి– గుండ్రంగా, నున్నగా తయారవుతాయి – వాటినే 'గులకరాళ్లు' అంటారు" అన్నాడు నానా.



అడవి మధ్యలో చీకటిగా, ప్రశాంతంగా వుంది. కానూ నానాకి చేరువగా వచ్చాడు. "రా, నా చెయ్యి పట్టుకో. ఈ రాళ్లమీదనుంచి ఎక్కి, అడ్డ దారిన వెళ్ళిపోదాం" అన్నాడు నానా.

నిటాగ్గా వుండే రాళ్ళు ఎక్కుతూ, చేతులతో, కాళ్లతో పాకుతూ, వేళ్ళూ, తీగలూ పట్టుకుంటూ ముందుకు వెళ్ళారు. వెళ్ళి వెళ్ళి, సృష్టిలోనే ఎంతో చిత్రమైన ప్రదేశం చేరారు. అక్కడ చెట్లు లేవు. నేల గతుకులూ, గొప్పులూను. కొండ మీద మూడు నాలుగు చోట్ల వున్న చిల్లుల్లోంచి నీరు పైకి చిమ్ముతోంది. కానూ ఎన్నడూ అంత పైకంటా ఎక్కలేదు. అందరితోనూ కలిసి పిక్‌నిక్‌కి వెళినప్పుడు కూడా ఎక్కలేదు.



అతనికి ఆశ్చర్యం వేసింది. ఊరంతటికీ నీరు అందించే నీటి ఊటలంటే ఇవేనా? "నానా, అలా చూడు, నీరు ఏలా వృధా అవుతుందో. మనకి నీళ్లెలా వస్తాయి?" అన్నాడు.

"సరిగ్గా చూసి మరీ మాట్లాడు. అదేం వృధా అవడం కాదు. కిందికి ప్రవహిస్తోంది – బడాపానీ చేరడానికి. ఎండిపోయిన నేల కొంత నీటిని పీల్చుకుంటుంది. ఇంటికి పోతూ ప్రవాహాన్ని దాటుతూ, ఆవులూ, గొర్రెలూ చక్కగా నీరు తాగుతాయి. ఇది వృధా అవడం ఏమీ కాదు. ఊరికి కావలసిన నీరు పైనున్న ఊటల నుంచి వస్తుంది."

కానూ పైకి చూశాడు. చుట్టూ పళ్లెం కట్టి, చూరువేసిన ఊటలు చాలా కనబడ్డాయి. దగ్గర కంటా వెళ్లి చూశారు. చుట్టూ కట్టిన గోడలు చూరు కంటా లేవు. లోపలికి గాలి పోడానికి వీలుగా గోడలకి చూరుకి మధ్య తీగె చట్రం అమర్చారు. కానూ లోపలికి తొంగి చూశాడు. ఎన్నో చిల్లులలోంచి నీరు ఉబికి, చిన్న ప్రవాహంగా చేరి తర్వాత పెద్ద ప్రవాహమయింది. అక్కడ నుంచి నీరు పెద్ద పెద్ద గొట్టాల్లోంచి వెడుతోంది. అక్కడ మిగిలిపోయిన నీరు కొండ పక్క నుంచి కిందికి ప్రవహించి దాదాపు నలభై మైళ్ల దూరంలో వున్న బడాపానీ చేరుతుంది.

# 9

కానూ నానాని అడిగాడు: "ఈ గొట్టాలు ఎక్కడికి వెడతాయి?"

"గొట్టాలు ఎక్కడికీ వెళ్లవు. గొట్టాలలో నీళ్లు ముల్కీ దగ్గరవున్న టాంకు లోకి వెడతాయి. అక్కడనుంచి ఊళ్లోకి వేరే గొట్టాలున్నాయి. గొట్టాలలో నీరంటే జైలులో నీరు అన్న మాట. అది బడాపానీ చేరలేదు. ఇంక పోదాం పద. ఇక్కడ బావుండదు నాకు."

"ఎందుకు?"

"ఇక్కడ ఎన్నో ఏళ్లు కాపురం ఉన్నాను. ఇక్కడికొస్తే ఏదో బాధగా వుంటుంది. నా ఇల్లు ఎక్కడ వుండేదో చూస్తావా?" అంటూ నానా దారి తీశాడు.

ఒక జాగా వుంది. దాని మధ్యలో కొన్ని రాళ్ళు గుట్టగా పోసి వున్నాయి. "ఈ రాళ్లేనా ఇంటికి పునాదిగా వుండేవి."

నానా రాళ్లను పక్కకి తొలగించాడు. మధ్యనుంచి ఓ క్రర బంతి ఇవతలికి దొర్లుకుంటూ వచ్చింది. ఒకప్పుడు ఎర్రగా వుండేది – ఇప్పుడు రంగు వెలిసిపోయింది.



నానా బంతిని తీసి కానూకిచ్చాడు. "ఇది తీసుకో. మా ఆవిడకి ఓ చిన్నబాబు వుండేవాడు. వాడికోసం చేశానీ బంతి. వాడిప్పుడు లేడు.. రా వెళదాం.. పొద్దుపోతోంది."

వాళ్లు ఇంటికి చేరేటప్పటికి, సూర్యుడు అస్తమిస్తున్నాడు. కంగారుపడుతూ లైకోర్ రోడ్డుమీద వీళ్లకోసం వెతుకుతూ ముందుకి వెనక్కి చూస్తోంది అమ్మ.

వీళ్లకి ఏదో అపాయం వచ్చి వుంటుందని అనుకుందేమో, వీళ్లని చూసేసరికి వెర్రికోపం వచ్చింది అమ్మకి. నానాని నానా చీవాట్లు పెట్టింది. కానూని చెంప మీద ఫెళ్లున కొట్టింది. కొట్టిన తర్వాత వెక్కి వెక్కి ఏడుస్తూ, కానూ రెక్క పట్టుకుని ఇంట్లోకి ఈడ్చుకుపోయింది.

రాత్రి భోజనాలవేళ అయింది. "నువ్వు నీ గదిలో భోజనం చెయ్యి. నీ దగ్గరవుంటే కానూకి వెర్రులెత్తుతూంటాయి" అంది అమ్మ. "మళ్లీ ఇంకోసారి నానాతో వెళ్లావంటే వొళ్లు వాయకొడతాను. పారేయ్, ఆ వెధవ బంతి!" కానూ చేతిలోంచి బంతి లాక్కుని, కిటికీ తలుపు తీసి బలంగా గిరాటేసింది. నానా నోరు విప్పలేదు. కాళ్లీడ్చుకుంటూ తన గదికి వెళ్లిపోయాడు. అన్నం ముట్టుకోకుండా తిప్పి పంపేశాడు.

మర్నాటి పొద్దున్న నిద్రలేస్తూనే నానా గదికి పరుగెత్తాడు కానూ. నానా లేడక్కడ. అతని కర్ర, కంబళి, పెద్ద సంచీ కూడా లేవు. కానూ వెనక్కి తిరిగొచ్చి తన పులి బొమ్మల పుస్తకం తీసి బొమ్మలవేపు తదేకంగా చూడడం మొదలుపెట్టాడు.

కొంతసేపటికి వంటమనిషి నానాకోసం రొట్టె, పాలు తీసుకుని నానా గదివైపు వెళుతున్నాడు. కానూ తల ఎత్తి అన్నాడు: "నానాకి రొట్టె, పాలు అక్కరలేదు. అతను వెళ్లిపోయాడు."

ఈ మాటలు విన్న అమ్మ లోపల నుంచి పరుగెత్తుకొచ్చింది. "వెళ్లిపోవడమేమిటి? ఈ చలికాలంలో... ఎనభై ఏళ్ల ముసలి మనిషి ఎక్కడికెడతాడు?"

కానూ బాధపడుతున్నాడు. "బడాపాసి దగ్గరికి వెళ్ళాడేమో. అతనికోసం

పడవ అక్కడికొస్తుంది. తన భార్యని కలుసుకోడానికి వెడతాడట. కొండమీది కెళ్లిన తన కొడుకుకోసం అతను చేసిన బంతిని నువ్వు అవతలికి గిరాటేసేశావు''

అమ్మ ముఖం పాలిపోయింది. మెల్లిగా పెరట్లోకి వెళ్లి ఆ బంతిని తీసుకొచ్చింది. తన చీరకొంగుతో బంతిని తుడుస్తూ అంది: "రేపు కలకత్తా నుంచి మీ నాన్నగారొచ్చి నానా ఏడీ అని అడిగితే ఏం చెప్పను ?''

కానూ అన్నాడు: "నానా కోసం బాపూ కేన్వాసు బూట్లు, ఊలు బనీను తెస్తున్నారట. తోలు చెప్పులు నానాకి నొప్పిపెడతాయిట, అందుకనీ !'' కానూ ఏడవడం మొదలెట్టాడు.

అమ్మ లేచి గదిలో ఇటూ అటూ తిరుగసాగింది. కర్టెన్లు సర్దింది. పుస్తకా





లను వరుసలో పేర్చింది. తిరిగి తిరిగి చతికల పడింది. "బడాపానీ దగ్గరికి వెళ్లి నట్టు నీకు తెలుసా? బస్సు ఎక్కి వెళ్ళాడా?"

కానూ నవ్వుకున్నాడు. "బస్సు ఎలా ఎక్కుతాడు? ధాన్‌ఖేతీ నది గట్టునే వెళ్లి, అది బడాపానీ చేరేచోటికి వెడతాడు. పడవ ఎక్కడికొస్తుందో ఎవరికి తెలుసు?"

అమ్మకిదేమీ అర్థం కాలేదు, "పద, మనం కూడా ఆ దారినే వెడదాం. ఎలా గయినా నానాని వెనక్కి తీసుకురావాలి. ఇదంతా నా తప్పు. అలాటి మంచి వాళ్లని ఎక్కడోగాని చూడం."

నిమిషంలో తయారయారు బయలుదేరడానికి. చిన్న సంచీలో ఏదో తినే వస్తువులు పెట్టింది అమ్మ. తనో కర్ర తీసుకుని, కానూకి ఒకటిచ్చింది. ఇద్దరూ ఉన్ని బట్టలూ, బలమైన బూట్లూ వేసుకున్నారు. చిన్న కర్రబంతిని తన జేబులో వేసుకున్నాడు కానూ. బంతిని ఇంటిదగ్గర వుంచేయడం ఇష్టం లేకపోయింది కానూకి.

మిగిలిపోయిన నీళ్లతో ఏర్పడ్డ చిన్న చిన్న ప్రవాహాలు, ఓ నదిగా ఏర్పడ్డాయి – ముల్కీకి కొంచెం అవతలగానే, కొండ పక్కన బిందులు తొక్కుతూ ప్రవహిస్తుంది ఆ నది. కొండ దిగువన కొంచెం పరుచుకుని జలపాతంలా కిందికి దుమికి ధాన్‌ఖేతీ నదిని చేరుతుంది. రెండు ప్రవాహాలూ కలిసి క్రిందికి ప్రవహిస్తాయి.

ఎంతో అందంగా వుంది ఆ ప్రదేశం. నది పక్క పెద్ద పెద్ద చెట్లు - సీదాగా వున్న దారి. వీళ్ళు వెళ్ళవలసిన తోవ అదే.

నీడగా వుండే ఓ చోటు చూపిస్తూ కానూ అన్నాడు: "కొందరు ఇక్కడ చేపలు పడతారు. ఒకొక్కప్పుడు వేసవికాలంలో నీరు బాగా వున్నప్పుడు చుట్టు పక్కల దొరువులనుంచి చేపలు ధాన్‌ఖేతి నదికి వచ్చి చేరుతూంటాయి. అందుకని చాలామంది ఇక్కడే చేపలు పడతారు."

అమ్మకి ఆశ్చర్యం వేసింది. "నీకెలా తెలుసు ఇదంతా?" అని అడిగింది.

"నానా అప్పుడప్పుడు నన్ను ఇక్కడికి తీసుకువచ్చేవాడు."

చెట్ల మధ్య నుంచి గాలి ఊళలు వేస్తోంది. అమ్మకి ఊపిరాడ్డం లేదు. "కాసేపు ఇక్కడ ఆగుదాం. ఇలా ఏక బిగిన నేను నడవలేను."

పొద్దుటినుంచీ ఎండకి వేడెక్కిన ఓ రాయి మీద అమ్మ చతికిలపడింది. కూచుని కాళ్ళు రాసుకోనారంభించింది. కొండ దిగువకి నడుస్తుంటే, మనిషి బరువంతా మోకాళ్ళమీద పడుతుంది కనక నొప్పి పెడతాయి. పెద్దవాళ్లకే ఈ నొప్పులు — అమ్మ, నానాలాంటి వాళ్లకి. కానూవంటి పిల్లలకి కాదు.

కానూ చుట్టుపక్కల పరిశీలిస్తున్నాడు. రాళ్ళకింద ఓ కన్నం వుంది. దాని పక్కన కాస్త నీరు చేరింది. చిన్న చిన్న కుక్కగొడుగులు బయలుదేరుతున్నాయక్కడ. ఉల్లిపాయలతో కలిపి వేయించుకుంటే కుక్కగొడుగులు చాలా రుచిగా వుంటాయని చెప్పేవాడు నానా. కాని అమ్మ వాటిని ముట్టుకోనిచ్చేది కాదు. వేళ్లు నొప్పి చేస్తాయనేది. కుక్కగొడుగులు తిని కొందరు చచ్చిపోయారట కూడానూ. అవి విషపు జాతివైతే చస్తారు అన్నాడు నానా. ఎంచి తీసుకోడం తెలియాలట. నూగువుండే కుక్కగొడుగులు అయితే తియ్యగా వుంటాయి; తినచ్చు.

కన్నంలోకి చూశాడు కానూ. ఏవో రెండు కళ్ళు మెరుస్తున్నాయి లోపల. అక్కడ నీటి ఎలకలు నివసిస్తాయి. ఈ కన్నంలో వుండే నీటిఎలకకి నాలుగు పిల్లలుండేవి — అదివరకు కానూ చూశాడు. నానా, కానూ లోపలికి చూసేసరికి

అది పళ్ళు బయటపెట్టింది. పిల్లలు ఈ పాటికి ఎదిగి వాటి తోవన అవి వెళ్లి వుంటాయి. ఇప్పుడు ఒక్కత్తే, మూలకి ఒదిగి కళ్ళు చికిలిస్తూ కూచుంది. జేబులో మిగిలిన పప్పు బద్దలు కానూ కన్నం మొదట్లో పోశాడు. నానా ఎప్పుడో చెప్పాడు – చిన్న చిన్న జంతువుల మీదికి తినేవయినా సరే విసిరితే అవి బెదిరి పోతాయిట.

అక్కడ ఒక చిత్రమైన గడ్డి పెరుగుతుంది. ఆకులు పొడుగ్గా చారలతో వుంటాయి. నలిపితే తియ్యటి వాసన వేస్తాయి. అమ్మకి ఆ వాసన నచ్చింది. ఈ గడ్డిని అమ్మ అదివరకు ఎప్పుడూ చూడలేదట.



వెడల్పాటి రేకులతో తెల్లటి పువ్వులున్నాయి. ఆకుల కిందిభాగంలో నురుగు ముద్దలాంటిదేదో వుంది. "ఛీ! ఎవరో ఉమ్మువేసి వుంటారు, పారేయ్" అంది అమ్మ.

కానూ నవ్వాడు. "అమ్మా, నీకు తెలీదూ, ఇది ఉమ్ము కాదు. ఈ ముద్ద లోపల ఓ చిన్న పురుగుంది. తన శరీరంలోంచే నురుగు ఊదుతుంది ఆ పురుగు. తను దాక్కోడానికే ఆ ఏర్పాటు. తొండలు, పిచికలు ఎగరేసుకు పోకుండా ఇది దానికి రక్షణ!" అన్నాడు.

"మీ నాన్నగారికి చెప్పినట్టుగానే నానా నీకు కూడా ఇవన్నీ నేర్పివుంటాడు.





నాన్నగారికి తెలుసు ఈ జాగాలన్నీ. . . రా ఇంక బయలుదేరుదాం. ఆలస్యమయితే నానా మనకి అందడు. రేపు మీ నాన్నగారు వస్తున్నారు కూడాను!"

ఈ మాట వినేసరికి కానూకి ఎంతో సంతోషమయింది. అడుగులు చురుగ్గా వేయనారంభించాడు. "తొందరగా నడమ్మా, నానా చాలా తెలివైనవాడు. మన కంటె చాలా ముందు ఉండి వుంటాడు."

నడవగా నడవగా ఇద్దరికీ దాహమేసింది. మోకాళ్లమీద వంగి, చల్లనినీరు దోసిళ్లతో తీసుకు తాగారు. మళ్లీ బయలుదేరారు. కొండ దిగువకి నడక సాగించారు. కొంత బాగా వుంటే, మరో కొంత దూరం దారి బావుండదు. కానూ త్వరత్వరగా నడిచి, కొంత దూరం వెళ్లి, అమ్మకోసం ఆగేవాడు. పెద్ద పెద్ద రాళ్లు దాటడానికి అమ్మ చేయి పట్టుకొనేవాడు.

# 10

ఎండ నడినెత్తి మీద కొచ్చింది. పొద్దున్న నుంచి నడుస్తూండడం వల్ల వాళ్లు అలిసిపోయారు. కాని నానాని తీసుకువెళ్ళకుండా వెనక్కి వెళ్ళిపోవడం వాళ్లకి ఇష్టంలేదు. పైగా, తిరుగు ప్రయాణం అంటే కొండపైకి ఎక్కడమే! ఎక్కడానికిప్పుడు వాళ్లకి ఓపికలేదు.

అమ్మ ఆయాసపడుతోంది. "ఏ దారిన వెళ్ళాడో ఎవరికి తెలుసు? అసలు అతను ఈ తోవన రానేలేదేమో?" అంది.

"ఈ తోవనే, నది పక్కనుంచే వచ్చివుంటాడు. ధాన్‌ఖేతీ నది అయినా, ఏ ఇతర ప్రవాహమయినా ఐడాపానీ చేరతాయి. అందుచేత ఏ తోవన వచ్చినా ఐడాపానీ చేరుకోవచ్చు. నానా పడవ వచ్చేది అక్కడికే కదా!"

ఈ మాటవిని అమ్మ చురుగ్గా నడవ నారంభించింది. కానూ పక్కన ఇంచు మించు పరుగెత్తడం మొదలెట్టింది. అమ్మ ముఖం కందగడ్డలా తయారయింది. జుత్తు రేగిపోయింది. మధ్యాహ్నం అంతా నడిచారు. సాయంకాలం కావొచ్చింది. ముగూమీ చేరారు. ఇక్కడే నది నూరు మీటర్లు కిందికి దూకుతుంది. అమ్మ ఆగిపోయింది. "ఎలాగ వెళ్లడం?" అంది.

కానూ నవ్వి పక్కనున్న సన్నని బాట చూపించాడు. ఆ బాట వెంబడే మెలికెలు తిరుగుతూ వెడితే జలపాతం కిందికి చేరతారు. "అదిగో, అదీ మన దారి. నీ మోకాళ్ళు నొప్పి పుడుతున్నాయేమో నడవగలవా అమ్మా?" అన్నాడు.

"ఇప్పుడు నొప్పి లేదులే" అంటూ కానూ కంటె చురుగ్గా నడవనారంభించింది అమ్మ. జలపాతం చప్పుడు చెవుల్లో చిల్లులు పొడుస్తోంది. ఒకరి మాట మరొకరికి వినబడ్డంలేదు. విరుచుకుపడే నీటి తుంపరలు వాళ్ళ వొంటిమీద పడుతున్నాయి. వాళ్ళ కాళ్ళ కింద నేల అదిరిపోతున్నట్టుగా వుంది.

మాట్లాడకుండా కిందికి దిగారు. ఒక్క అడుగు తడబడినా ప్రమాదమే. ఒక్కోసారి అమ్మ ఆగి, జలపాతం వైపు ఆశ్చర్యంగా చూసేది. పైకి చూస్తే

కొండలు, కోనలు, పెద్ద పెద్ద చెట్లు, మబ్బులు లేని ఆకాశం – అంతా అసహజంగా కనబడేది. చివరకి, కిందికి చేరుకున్నారు.

ఉవ్వెత్తుగా పడే నీరు కింద దొరువులు చేసేది. నీరు గిరగిరా తిరిగేది. నీటిలోంచి ఎరిగిపడే బిందువులు చుట్టూ మసకేసేవి. సూర్యకిరణం కనబడితే, రంగు రంగుల ఇంద్రధనుస్సుగా మారిపోయేది. విస్తుపోయి చూసింది అమ్మ. మాట్లాడకుండా అమ్మ పక్కన నిలుచున్నాడు కానూ.

ఇంతలో – అకస్మాత్తుగా, పక్కనున్న అడివిలోంచి చేతుల్లో ఏదో సుతారంగా పట్టుకుని ఎదురొచ్చాడు నానా.

"నానా, నానా, నానా!" అంటూ అరుస్తూ అతని వైపు పరుగుతీశాడు కానూ.



అమ్మ కూడా పరుగెత్తింది. నానా కాళ్లమీద పడిపోయింది. అమ్మ కళ్ల నుంచి కన్నీరు కారుతోంది.

"నానా! నన్ను క్షమించవూ?" అంది రొప్పుతూ.

నానాకి కోపం వచ్చింది. "లే, లే, ఏడవడానికి ఇది సమయం కాదు. ఈ పక్షి రెక్కకి దెబ్బ తగిలింది, కనబడ్డం లేదూ? వేటగాళ్లు మళ్లీ బయలుదేరా రిక్కడ - బుద్ధి తక్కువ మనుషులు! లే, తొందరగా కాసిని పుల్లలు పోగేయి, కట్టుకడదాం! లే."

నానా ఓ బండమీద కూర్చున్నాడు- చిన్న గుడ్డపీలికతో దాని గాయం తుడుస్తూ, రెక్కలు నిమురుతూ. ఎంతో అందంగా వుంది ఆ పక్షి. అమ్మ తెచ్చిన సంచిలో గుడ్డలూ, దారం, చాకు మొదలైన వస్తువులున్నాయి. కానూ పుల్లలు ఏరుతున్నాడు. కళ్లు మూసుకుని నానా ఒడిలో ఆయాసం తీర్చుకుంటోంది ఆ పక్షి.



"చచ్చిపోయిందా?" అని కానూ ఒక్క అరుపు అరిచాడు.

నానా మందలించాడు కానూని. "అగు! మగవాళ్లు ఏడవరు... ఇదిగో ఈ పుల్ల అడ్డువేసి కట్టుకడతాను – జాగ్రత్తగా పట్టుకో."

ఆ పక్షికి మెడ చుట్టూ బంగారం, నీలం, ఆకుపచ్చ రంగులు మెరుస్తున్నాయి, కాళ్లు పసుపు పచ్చగా వున్నాయి. మెల్లిగా కళ్లు తెరిచింది. దాని కళ్లు నల్లగా వున్నాయి. కానూ ఎగిరి గంతేశాడు. నానా తన కంబళీలో దాన్ని చుట్టిపెట్టి అమ్మ ఒడిలో వుంచాడు. "నా సామాన్లు తెచ్చుకుని వస్తానుండు!", అన్నాడు.

అడివి మొదట్లో తన కోటు, టోపీ, సంచీ ఒక చెట్టుకి వేలాడదీశాడు నానా. ఒక్క క్షణంలో నానా, వెంట వెళ్ళిన కానూ తిరిగి వచ్చారు.

"ఇంటికెడదాం!" అన్నాడు నానా.

అమ్మకి భయమేసింది. "ఇప్పుడు ఇంటికెలా వెళ్ళగలం నానా? అంత దూరం ఇప్పుడు నడవగలిగే ఓపికలేదు నాకు. ఒక్క అడుగు వెయ్యలేను."

"మన ఇల్లు అంత దూరమేమీ కాదు. ఇదిగో ఈ మలుపు దాటితే అవతల బస్సు రోడ్డుంది. ఇక్కడ బస్సు ఎక్కితే సరాసరి ముల్కి కొండ దగ్గర దిగుతాం. ముల్కి నుంచి బడాపానీ దాకా వెడుతుంది ఆ బస్సు. నేనలాగే వచ్చాను."

నానా వాళ్ళవైపు ఒక్కసారి తేరిచూశాడు. "ఇంత దూరమూ నడిచే వచ్చారా?" అమ్మ మాట్లాడకపోయేసరికి, కానూతో అన్నాడు: "అమ్మని తీసుకొచ్చే పద్ధతి ఇదే నేమిటోయ్?" కానూ తలకిందికి దించేశాడు.

ఆ తర్వాత నానా ప్రక్కన బస్సులో కూర్చుని కానూ అన్నాడు మెల్లిగా: "నది పక్కనుంచే నడిచి రావలిసి వచ్చింది. నీ పడవ ఎక్కడకొస్తుందో మాకు తెలీదుగా మరి!"

నానా విస్తుపోయాడు: "పడవా? ఏం పడవ? ఇది పడవల్ని గురించి మాట్లాడుకునే సమయం కాదు– పడవలట, పడవలు! ఈ పక్షిని ఎవరు చూస్తారు? కాస్త రెక్కలికి సత్తువ వచ్చిందంటే పొడుస్తుంది అందర్నీ. మరి

బాపూ రేపు వస్తున్నాడా? చేపలు పట్ట డానికి అతనికి తోడు ఎవరు వెడతారు? ఇప్పుడు పడవల్ని గురించి మాట్లా డకు!'' అన్నాడు.

సాయంకాల మయేసరికి ఇంటికి తిరిగి వచ్చేశారు. వెచ్చని జాగాలో ఓ బుట్టలో పెట్టారు ఆ పక్షిని. వంటమనిషి భోజనం సిద్ధం చేసుకు కూర్చున్నాడు. మాలీ రోడ్డుమీదనే వీళ్లగురించి ఎదురు చూపు చూశాడు.

మర్నాడు బాపూ వచ్చాడు. వస్తూ వస్తూ, ఎవరికీ చెప్పకుండా సోనాలీ నుంచి అమ్మమ్మని కూడా తీసుకొచ్చాడు. ఆవిడ నవ్వుతూ, అందరినీ ఎంతో నవ్వించింది.

కానూ అమ్మమ్మతో అన్నాడు: ''అమ్మకి సోనాలీ అంటే వున్నంత అభిమానం ముల్కీ అంటే లేదు.''
''ఎందుకనీ?'' అని అడిగింది అమ్మమ్మ.

''మన ఊరూ, మన ఇల్లూ చూడాలని వుంది నాకు!'' అంది అమ్మ.

''మన ఇల్లు చూడాలని వుందా?'' అని అడిగింది అమ్మమ్మ.



“మనలో ఇల్లు అంటే మనం ఎక్కడ వుంటామో అదే మన ఇల్లు. ఇరుగు పొరుగువాళ్ళే మన స్నేహితులు. ఇది నీ ఇల్లు. ఇది నా ఇల్లు కూడా కాబోతోంది. మీ చిన్న మావయ్య రిటైరయాడు. సోనాలీలో ఇల్లు అతను చూసుకుంటాడు. కొన్నాళ్లపాటు నేను ఇక్కడే వుందామనుకుంటున్నాను- మీకు అభ్యంతరం లేకపోతే. ఈ ఊరంటే నాకెంతో ఇష్టం” అంది అమ్మమ్మ.



